



ఎ. హెచ్. అబ్దుల్ రజాక్ సాహెబ్ గారు.



ఓ. ఎ. హెచ్. అబ్దుల్ సమద్ సాహెబు,
(ఉరఫ్ చందామియా.)

శ్రీ క[redacted]బుగారగు గులాం రసూల్ ఖాౝ బహదూరువారిచే సన్మానింపబడిన నంద్యాల్ చౌక్ మసీదు యినాందారు ఉస్తాద్ హకీం అబ్దుల్ లతీఫ్ సాహెబుగారి కొమారులు, పి. వి హెచ్. అబ్దుల్ రజాక్ సాహెబుగారు. పి. వి. హెచ్. అబ్దుల్ సందామియ్యాగారు.

ఈ గ్రంథము సమాప్తియగువంతవరకును తమ సాన్నిధ్యమున నను నిలిపికొని అవ్యాజప్రేమచే ఆదరించిన ఈ సోదరుల కీగ్రంథమును సమర్పించుచున్నాను.

దేశోన్నతికి తోడ్పడు వీరికి ఖుదా పరమేశ్వరుడు ఆయు రారోగ్యైశ్వర్యములు ప్రసాదించుగాత.

టి. వి. రాఘవాచార్యులు.

# పీ ఠి క.

బ్రహ్మశ్రీ టి. వి. రాఘవాచార్యులుగారిచే రచింపఁబడిన కరణీకతంత్రమును సాకల్యముగాఁ జదివితిని. వారు నన్నీ గ్రంథమునకుఁ బీఠిక వ్రాయుమనుటకుఁగల యుద్దేశ్యమును నేను గ్రహింపఁజాలనైతిని. ఒకవేళ మోమోటమిలేకుండ వ్రాయుదునను తలంపుతోడ నన్నుఁగోరి యుండిరేమో! ఏది యెట్లయినను నన్నర్థించుటఁజేసి వ్రాయక తీరదయ్యె.

నిజముగ నాలోచించినయెడ నాంధ్రలోకంబున విశ్వబ్రాహ్మణులకుఁ జేయఁబడిన మహోపకారము మఱియే యితర కులమునకుఁ జేయఁబడి యుండలేదు. అంతో యింతో ప్రతికులమునకు నిందుఁబాలున్నది. కాని యితర కులములుచేసిన కీడొకయెత్తు బ్రాహ్మణులుచేసినది మఱియొకయెత్తు.

ఒకవ్యక్తి చేసిన యపకారమును నాధారముఁజేసికొని, కులమునంతయు ద్వేషించుట మహాపచారము. ధర్మాధర్మంబు లెఱుంగక పాడువాఱిన మనంబుగాని యెండెద్దియు నిట్టిదానికుపక్రమింపదు. ఒక్క మాదలకరణముఁచేసిన కార్యముచేత విశ్వబ్రాహ్మణుల "కరిణీకము" ల గోపరాజు రామప్రధాని హరించి, స్వకులజుల కిప్పించుట కేవలము దుండగమని చెప్పుటకు సంశయింపఁబని యుండదు. మాదల కరణము చేసినది యవి నీతికార్యమన వలనుపడదు. అంతకన్నను వేమడుంగులు దుండగములుచేయు కరణములు వర్తమానంబునఁ బెక్కురున్నారు. ఆకారణముచే నియోగుల కరణీకపు వృత్తులు దొంగిలించుట పాడియగునా? ఇంతకు మాదల కరణముచేసిన

దోషమేమి ? సర్కారున కీయవలసిన పన్ను జంకు గొంకు లేక వసూలుచేయుటా ? అక్కటా ! యిదియే యవినీతికార్యమైన మఱి యెట్టిది నీతియగును. రామ్యప్రధాని సదుద్దేశ్యముకలవాఁడ యినవో నిమంత్రితుఁడయిన బ్రాహ్మణుండు పన్నియ లేక నిర్బంధితుఁడైనప్పుడు తానేల యాపైకమునిచ్చి విడుదల పొందఁగూడదు ? ఇదియంతయుఁ గపటనాటకము చేయబోవు దౌష్ట్యమును మఱుగుపుచ్చుటకు పన్నినసాకు. దీనికిఁ దోడు రాజులస్వతంత్రులైరి. వారెత్తుటకు వీలులేదు. అధర్మమని మొఱపెట్టుకొన్న రాజభయంబున విను పెద్దలులేరు. పూర్వమీ కారణంబున ధర్మము విపరీతమయినది. అందుచే నిదియా నిది కాదనువారు కానఁబడరైరి పాశ్చాత్యులు రాజులగుటచే నీవిధ భయమునకుఁ జోటులేక పోయినది. అందుచే నిర్భయముగ ధర్మచ్యుతి కల్గినప్పుడు మొఱపెట్టుకొనుటకు నసువు కల్గినది.

తమ పూర్వచరిత్రఁ దలంచుకొన్నచో విశ్వబ్రాహ్మణులకు నోరులు ంపల్లకమానదు ఆగ్రహము కల్గినప్పుడు సామాన్యముగా వివరము దూరమగుట తటస్థించును. ఈ పోకడ యీవిమర్శనమునందుఁ గొన్నిచోటులఁ గననగు. కాని యిది నైజమనుకొందును. పశ్చాత్తాపులయి యిదివఱకు నీకులమునకు నపకారముఁ జేసినవారు వారి పురోభివృద్ధికిఁ జేదోడు వాదోడగుట ధర్మము.

ఇట్లు

త్రిపురనేని రామస్వామి (చౌదరి),
శతావధాని, బారిష్టరు, ఆంధ్ర విశ్వ విద్యాపరిషత్సభ్యుఁడు
1—6—28. మునిసిపల్ చేర్ మెన్, తెనాలి.

# పీ ఠి క .

బ్రహ్మశ్రీ టి. వి. రాఘవాచార్యులుగారిచే రచింపఁబడిన కరణీకతంత్రమును సాకల్యముగాఁ జదివితిని. వారు నన్నీ గ్రంథమునకుఁ బీఠిక వ్రాయుమనుటకుఁగల యుద్దేశ్యమును నేను గ్రహింపఁజాలనైతిని. ఒకవేళ మోమోటమిలేకుండ వ్రాయుదునను తలంపుతోఁ నన్నుఁగోరి యుండిరేమో ! ఏది యెట్లయినను నన్నర్థించుటఁజేసి వ్రాయక తీరదయ్యె.

నిజముగ నాలోచించినయెడ నాంధ్రలోకంబున విశ్వబ్రాహ్మణులకుఁ జేయఁబడిన మహాపకారము మఱియే యితర కులమునకుఁ జేయఁబడి యుండలేదు. అంతో యింతో ప్రతికులమునకు నిందుఁబాలున్నది. కాని యితర కులములుచేసిన కీడొకయెత్తు బ్రాహ్మణులుచేసినది మఱియొకయెత్తు.

ఒకవ్యక్తి చేసిన యపకారమును నాధారముఁజేసికొని, కులమునంతయు ద్వేషించుట మహాపచారము. ధర్మాధర్మంబు లెఱుంగక పాడువాఱిన మనంబుగాని యెుండెద్దియు నిట్టిదానికుపక్రమింపదు. ఒక్క మాదలకరణముఁచేసిన కార్యముచేత విశ్వబ్రాహ్మణుల " కరిణీకము " ల గోపరాజు రామప్రధానిహరించి, స్వకులజుల కిప్పించుట కేవలము దుండగమని చెప్పుటకు సంశయింపఁబని యుండదు. మాదల కరణము చేసినది యవి నీతికార్యమన వలనుపడదు. అంతకన్నను వేమదుంగులు దుండగములుచేయు కరణములు వర్తమానంబునఁ బెక్కురున్నారు. ఆకారణముచే నియోగుల కరణికపు వృత్తులు దొంగిలించుట పాడియగునా ? ఇంతకు మాదల కరణముచేసిన

దోషమేమి ? సర్కారున కీయవలసిన పన్ను జంకు గొంకు లేక వసూలుచేయుటా ? అక్కటా ! యిదియే యవినీతికార్యమైన మఱి యెట్టిది నీతియగును రామప్రధాని సదుద్దేశ్యముకలవాఁడ యినచో నిమంత్రితుఁడయిన బ్రాహ్మణుండు పన్నియ్యలేక నిర్బంధితుఁడైనప్పుడు తానేల యాపైకమునిచ్చి విముదల పొందఁ గూడదు ? ఇదియంతయుఁ గపటనాటకము చేయఁబోవు దౌష్ట్యమును మఱుఁగుపుచ్చుటకు పన్నినసాకు. దీనికిఁ దోడు రాజులస్వతంత్రులైరి. వారెత్తుటకు వీలులేదు. అధర్మమని మొఱపెట్టుకొన్న రాజభయంబున విను పెద్దలులేరు. పూర్వమీ కారణంబున ధర్మము విపరీతమయినది. అందుచే నిదియా నిది కాదనువారు కానఁబడరైరి. పాశ్చాత్యులు రాజులగుటచే నీవిధ భయమునకుఁ జోటులేక పోయినది. అందుచే నిర్భయముగ ధర్మచ్యుతి కల్గినప్పుడు మొఱపెట్టుకొనుటకు వసువు గల్గినది.

మన పూర్వచరిత్రఁ దలంచుకొన్నచో విశ్వబ్రాహ్మణులకు నోఁటిలోఁ గంఫిల్లక మానదు ఆగ్రహము కల్గినప్పను సామాన్యముగా వివరము దూరమగుట తటస్థించును. ఈ పోకడ యీవిమర్శనమునందుఁ గొన్నిచోటులఁ గననగు. కాని యిది నైజమనుకొందును. పశ్చాత్తప్తులయి యిదివఱకు నీ కులమునకు నపకారముఁ జేసినవారు వారి పురోభివృద్ధికిఁ జేదోడు వాదోడగుట ధర్మము.

ఇట్లు

త్రిపురనేని రామస్వామి (చౌదరి),
శతావధాని, బారిష్టరు, ఆంధ్ర విశ్వ విద్యాపరిషత్సభ్యుఁడు,
1—6—28. మునిసిపల్ చేర్మెన్, తెనాలి.

# అభిప్రాయము

చరిత్ర మెరుగని జాతి తన జీవితమును గడుపుటలో "మార్గ మెరుగని తెరవరి యంధకారమున జిక్కువడి పెక్కు జిక్కులనొందు" చందమున నమితచిక్కులకులోనై యధఃపతితమగుట సహజము. విప్రులాసహజస్వభావము నెరిగియే తమకు తంత్రికోవిదత్వముచే గురుస్థాన మలంకరించి యితరులగు మహమ్మదీయదాడులలో దేశమంత సంరక్షకులై తెగవిడని కృషి జేయుచు విద్యావిషయమున వారలపై నాధారపడియుండుటచేత యాకాలానుకూలత నూతగొనిన విప్రులు తదితరుల గత చరిత్రమును రూపుమాపి తద్వారా యొకలన దరి నధోగతిపాలు గావించి యున్నారు. ఇప్పుడా విప్రచరిత్రమును హరింపజేయుటకు సుసాధనము భారతీయుల గతచరిత్రమును కలరూపమున నిరూపించుటయే. అట్టి భారతీయుల గతచరిత్రమును వెల్లడిచేయుట కనువగు ప్రమాణములు చోరగ్రస్తములై యుండుటవలన తగు ప్రమాణములు లభ్యమగుట దుస్సాధ్యమై యుండెను. అట్టితరి పరిశోధనాశీలురగు బ్రిటిషువారు భూమియందును, గాళ్లపైనను, రాగిరేకులపైన నుయున్న శాసనములను శోధించి ప్రచురించి భారతీయుల కృతజ్ఞతకు పాత్రులైరి. ఆశాసనముల సహాయమున బ్రా॥ కీ॥ శే॥ కొమఱ్ఱాజు లక్ష్మణరావుపంతులుగారు, శ్రీయుత చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు మున్నగువారు కొంతవరకీ దేశచరిత్రను వెల్లడిగావించి ఆంధ్రుల కృతజ్ఞతకు పాత్రులైరి. అటులనే విశ్వబ్రాహ్మణ కరిణీకములను విప్రులు హరించుట సద్ధర్మమని నిరూపించుటకుగాను వెలువడిన "కరణీకోద్ధారిణి" యందుగల స్వకపోలకల్పితములను సత్యాసత్యనిర్ణయములు చేయుటకునై "కరిణీకతంత్రము" అను గ్రంధమును వ్రాసి బ్ర॥ వే॥ టి. వి. రాఘవాచార్యులుగారును యాంధ్రుల కృతజ్ఞతకు అందునను విశేషించి విశ్వబ్రాహ్మణుల కృతజ్ఞతకు పాత్రులైరి.

విరాట్విగ్రహమునకన్న ఉత్సవవిగ్రహమునకు హెచ్చుపూజలు విధిగా జరుగుచున్నటులనే సర్వాధికారములు కలిగియున్న రాజుకన్న మిన్నగా ప్రజాసమూహము కరణమునకు వశంవదమై యుండక తప్పదు. అట్లగుటచేతనే "కరణముల ననుసరింపక విరసంబున దిన్నతిండి వికటించునుమీ" అని సుమతీశతకమున చెప్పుట కలిగినది. ఇవ్విధిని గురుస్థానము భారత మానవ సముదాయములో యధికపలుకుబడిని గలిగించునది కరిణీకస్థానమనట

కిసుమంతేనియు సందియముండదు. అట్టి కరిణీకస్థానములలో ముప్పాతిక మూడు వీసములు విశ్వబ్రాహ్మణులకును మిగిలినవి చాళుక్యవంశవర్ధనులగు బలిజసంఘము వారికిని హస్తగతమై యుండగా గజపతుల వంశమున జనించిన గణపతిరాజాకడ మంత్రిగనుండిన గోపరాజు రామయ తన కుతంత్రకోవిదత్వముతో తనరాజాకడ దానము నెపమున అయన్నొక్కగడియ రాజముద్రికను స్వాధీనము చేసికొని విశ్వబ్రాహ్మణుల కరిణీకములు తొలగించి తన కులజులగు విప్రుల కొసంగెనని శాసనచరిత్రాదులు చెప్పుచున్నది యాబాలగోపాలమెరింగినదే. ఆరామనమంత్రి యిట్లు విశ్వబ్రాహ్మణుల కరణీకముల విప్రుల కొసంగుట సధర్మమైన అతనాస ధర్మస్వరూపమును తనరాజునకుదెలిపి రాజు వలననే విశ్వబ్రాహ్మణుల కరిణీకములు విప్రుల కిప్పించవచ్చును. అతనట్లు చేయక కుతంత్రముతో రాజముద్రికను సంపాదించి తత్సహాయమున కరిణీకస్థానములనుండి విశ్వబ్రాహ్మణుల తొలగించి విప్రుల నేర్పాటుచేయుటచేత నయ్యది రామనమంత్రికిగల జాత్యభిమానమువలన జనించిన దుర్మార్గమని యెంతటి మందమతియైనను గ్రహించకపోడు. అట్లు జాత్యభిమానముచే దుర్మార్గము వహించిన రామనమంత్రిని, తమను రక్షించినందులకై విప్రులు చేయు పొగడ్తలున్మాదుని ప్రలాపములవలె విసర్జనీయములని విజ్ఞులంగీకరించకపోరు.

విశ్వబ్రాహ్మణుల కరిణీకములకు చేటొనగూర్చినది గజపతుల వంశమున జనించిన గణపతిరాజాకడ మంత్రిగయుండిన గోపరాజు రామప్రధాని యొక్కడేగాదు. తిక్కనసోమయాజియు విశ్వబ్రాహ్మణులు జైనమతావలంబులై యుండిరను నెపముతో కాకతీయ గణపతిదేవచక్రవర్తిని ప్రోత్సాహముజేసి జైనమతజులు నివసించు ముప్పదియారు గ్రామములను నాశనము గావించి విశ్వబ్రాహ్మణుల కరిణీకములను విప్రుల కొసంగునట్లు చేసియున్నాడు. ఇట్లు విప్రులనేకులు రాజులకడజేరి వారిని వశంవదుల గావించుకొని క్రమక్రమముగ విశ్వబ్రాహ్మణుల కరిణీకముల నూడబెరికి తమస్వాధీనము చేసుకొనియున్నారు. ఆ చరిత్రమునంతయు ప్రచురించ పండితమండలికి విధికృతమని మనవి చేయుచున్నాను.

ఇట్లు

సూర్యదేవ రాఘవయ్యా చౌదరి,

కొల్లూరు, గుంటూరుజిల్లా.

# అభిప్రాయము.

చరిత్ర మెరుగని జాతి తన జీవితమును గడుపుటలో " మార్గ మెరుగని తెరవరి యంధకారమున జిక్కువడి వెక్కు జిక్కులనొందు " చందమున నమితచిక్కులకులోనై యధఃపతితమగుట సహజము విప్రులాసహజస్వభావము నెరింగియే తమకు తంత్రకోవిదత్వముచే గురుస్థాన మలంకరించి యితరులందరు మహమ్మదీయకాదులలో దేశమంత సంరక్షకులై తెరపిలేని కృషి జేయుచు విద్యావిషయమున వారలపై నాధారపడియుండుటచేత యాకాలానుకూలత నూతగాగొనిన విప్రులు తదితరుల గత చరిత్రమును రూపుమాపి తద్వారా యొరులన దని నధోగతిపాలు గావించి యున్నారు. ఇప్పుడా విప్ర కుతంత్రమును హరింపజేయుటకు సుసాధనము భారతీయుల గతచరిత్రమును కలరూపమున నిరూపించుటయే. అట్లు భారతీయుల గతచరిత్రమును వెల్లడిచేయుట కనువగు ప్రమాణములు చోరగ్రస్తములై యుండుటవలన తగు ప్రమాణములు లభ్యమగుట దుస్సాధ్యమై యుండెను. అట్టితరి పరిశోధనాశీలురగు బ్రిటిషువారు భూమియందును, గాళ్లపైనను, రాగిరేకులపైననుయున్న శాసనములను శోధించి ప్రచురించి భారతీయుల కృతజ్ఞతకు పాత్రులైరి. ఆశాసనముల సహాయముచే కీ|| శే|| కొమర్రాజు లక్ష్మణరావుపంతులుగారు, శ్రీయుత చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు మున్నగువారు కొంతవరకీ దేశచరిత్రను వెల్లడిగావించి ఆంధ్రుల కృతజ్ఞతకు పాత్రులైరి. అటులనే విశ్వబ్రాహ్మణ కరణీకములను విప్రులు హరించుట సద్ధర్మమని నిరూపించుటకుగాను వెలవడిన " కరణీకోద్ధారిణి " యనుగల స్వకపోలకల్పితములను సత్యాసత్యవిమర్శనల యెదుట నుంచుటకునై "కరణీకతంత్రము" అను గ్రంథమును వ్రాసి బ్ర|| వే|| టి. వి. రాఘవాచార్యులుగారును యాంధ్రుల కృతజ్ఞతకు అంతకన విశేషించి విశ్వబ్రాహ్మణుల కృతజ్ఞతకు పాత్రులైరి.

విరాట్ విగ్రహమునకన్న ఉత్సవవిగ్రహమునకు హెచ్చుపూజలు విధిగాజరుగుచున్నటులనే సర్వాధికారములు కలిగియున్న రాజుకన్న మిన్నగా ప్రజాసమూహము కరణమునకు వశంవదులై యుండక తప్పదు. అట్లగుటచేతనే " కరణముల ననుసరింపక విరసంబున దిన్నతిండి వికటించునుమీ " అని సుమతీశతకములో చెప్పుట కలిగినది. ఇవ్విధిని గురుస్థానముభారతీ మానవ సముదాయములో యధికపలుకుబడిని గలిగించునది కరణీకస్థానమనుట

కినుమంతేనియు సందియముండదు. అట్టి కరిణీకస్థానములలో ముప్పాతిక మూడు వీసములు విశ్వబ్రాహ్మణులకును మిగిలినవి చాళుక్యవంశవర్ధనులగు బలిజసంఘమువారికిని హస్తగతమై యుండగా గజపతుల వంశమున జనించిన గణపతిరాజుకడ మంత్రిగనుండిన గోపరాజు రామయ తన కుతంత్రకోవిదత్వముతో తనరాజుకడ దానము నెపమున ఆయన్నొక్కగడియ రాజముద్రికను స్వాధీనముచేసికొని విశ్వబ్రాహ్మణుల కరిణీకములు తొలగించి తన కులజులగు విప్రుల కొసంగెనని శాసనచరిత్రాదులు చెప్పుచున్నది యాబాలగోపాలమెరింగినదే. ఆరామనమంత్రి యట్లు విశ్వబ్రాహ్మణుల కరిణీకముల విప్రుల కొసంగుట సద్ధర్మమైన అతనాస ధర్మస్వరూపమును తనరాజునకుదెలిపి రాజువలననే విశ్వబ్రాహ్మణుల కరిణీకములు విప్రుల కిప్పించవచ్చును. అతనట్లు చేయక కుతంత్రముతో రాజముద్రికను సంపాదించి తత్సహాయమున కరిణీకస్థానములనుండి విశ్వబ్రాహ్మణుల తొలగించి విప్రుల నేర్పాటుచేయుటచేత నయ్యది రామనమంత్రికిగల జాత్యభిమానమువలన జనించిన దుర్మార్గమని యెంతటి మందమతియైనను గ్రహించకపోడు. అట్లు జాత్యభిమానముచే దుర్మార్గము వహించిన రామనమంత్రిని, తమను రక్షించినందులకై విప్రులు చేయు పొగడ్త లున్మాదుని ప్రలాపములవలె విసర్జనీయములని విజ్ఞు లంగీకరించకపోరు.

విశ్వబ్రాహ్మణుల కరిణీకములకు చేటొనగూర్చినది గజపతుల వంశమున జనించిన గణపతిరాజుకడ మంత్రిగయుండిన గోపరాజు రామప్రధాని యొక్కడేగాదు. తిక్కనసోమయాజియు విశ్వబ్రాహ్మణులు జైనమతావలంబులై యుండిరను నెపముతో కాకతీయ గణపతిదేవచక్రవర్తిని ప్రోత్సాహముచేసి జైనమతజులు నివసించు ముప్పదియారు గ్రామములను నాశనముగావించి విశ్వబ్రాహ్మణుల కరిణీకములను విప్రుల కొసంగునట్లు చేసియున్నాడు. ఇట్లు విప్రులనేకులు రాజులకడజేరి వారిని వశంవదుల గావించుకొని క్రమక్రమముగ విశ్వబ్రాహ్మణుల కరిణీకముల నూడబెరికి తమస్వాధీనము చేసుకొనియున్నారు. ఆ చరిత్రమునంతయు ప్రచురించ పండితమండలికి విధికృతమని మనవి చేయుచున్నాను.

ఇట్లు

సూర్యదేవ రాఘవయ్యా చౌదరి,

కొల్లూరు, గుంటూరుజిల్లా.

# ఉపక్రమణము.

## కరణీకోద్ధారణియను.

నీ గ్రంథము పూరె వీరభద్రకవిచే రచింపబడినను శాస్త్రులచేయి తగులకుండా ముద్రణముగా లేదని ఈ గ్రంథము జదివినప్పుడు స్ఫురించుచునని వివరము మానివేసినాడను.

ఇపుడీ విమర్శనమునకుఁ గారణమేమన ? ఇందు సుగుణములు దుర్గుణములుగను దూషణలు భూషణములుగను మోసములు గ్రాసములుగను వర్ణింపబడిన పండితుల ప్రజ్ఞావిశేషంబులు లోకంబునకు జూపదలచియు, మరియు అభినవసరస్వతీ రూపమునబుట్టి, యబలులను విశ్వబ్రాహ్మణులను వెక్కిరింపుచూ వారలపై దాడివెడలి వారి నడగద్రొక్కుటయే కార్యదీక్షగా బూని వీణాపుస్తక పద్మాదుల పారవైచి శస్త్రాస్త్ర పాణియై మతోన్మత్తతచే నూగుచూ, ప్రయోగింపబడిన శస్త్రములలో కరణీకోద్ధారిణి యొకఁటగుటచేతను విమర్శింపబడుచున్నది.

శ్రీపరబ్రహ్మణే నమః.

# కరణీకతంత్రము.



## మంత్రులు.

చదువరులే ఇందలి ధర్మాధర్మములు నిర్ణయింతురుగాక.
ముందుకరణీకోద్ధారిణియను నామము దగినదియేనా ?
కరణీకోద్ధారణ ఇందేమయినఁ గనిపించుచున్నదియా ?

32 మంత్రుల చరిత్రమునందలి

సీ॥ గణకనిర్వాహంబు కల్పించె నూహూర
మహిగోపరాజు రామప్రధాని.........॥

మరియొకచో

సీ॥ తనకీర్తి యాచంద్రతారార్కముగ మంత్రి
కులులకు గరణీకముల నొసంగె ॥

తన కులమునకు తాను కరణీకములను ఇచ్చినాడు. ఇచ్చు కొన్న నెవరికేమి బాధయు కలుగనేరదుగాని, ఇచ్చినది యితరులసొమ్ముగానుండిన నేమి జరుగును, తగిన ప్రభువున్నగదా ? లోకులసొమ్ము తనకులమునకిచ్చిన విచారణ. బలుచోద్యము. పై పద్యమున గణకనిర్వాహంబు నూహూర కల్పించెనట ! ఏ యూర కల్పించెనో ? ఆయూరిలో నంతకుపూర్వము గణక నిర్వాహము లేకుండెనా ? కరణీక మేయూర లేకుండెను ? యిమ్మహాదాత కల్పించినదేయూరిలోనో, దెలియరాదు? లేక

కరణీకములజేయు విధానము దెలియకున్నయెడ నిట్లు చేయ దగునని కరణీకక్రమమును క్రొత్తగా సవరించెనా? అదియు లేదు. వూరూర కల్పించెనన్న యీకపిత్వమేమి. యూరూర. యూరూర. ఏయూర? ఏయూర? ఇదిగో కల్పించినదిది. పెక్కుశతాబ్దములనుండి వంశక్రమాగతమైన విశ్వబ్రాహ్మణ కరణీకములను మోసకృత్యమున తనకులము వారికి యిప్పించెను. గావున కరణికాపహారణమని జెప్పిన సత్యమైయుండెమన. గాని కరణీకోద్ధారిణియనునామము జెల్లదు. ఆవులనుగోసి చెప్పులు దానముజేసినయుద్ధారణ. యుద్ధరణమా? ఇట్టి చెప్పుల దానమున కానందించు పండితులేగాని పశుద్రోహమునకు పశ్చాత్తాపమందువారు గన్పింపరు.

ఇట్టి కుతంత్రపు మంత్రులను గోరంతలు గొండంతలు చేసి పొగడు కవులే గవులు. గోరంతలు కొండంతలు చేసినను అదియు నొక కొంత బాగుగనే యుండెడిది. అట్లును గాదు బొత్తిగా సర్వాబద్ధములు, నుళక్తి, పొగడ్తలు, ముఖస్తుతులు, స్తోత్రపాఠములు చూపుడు.

ఉ॥ మానఘనుండు బ్రహ్మకులమండనమూర్తి పరోపకారి దు।
ర్దానదురన్నముల్ గొనఁడుతప్పడుస్వామిహితోపకారముల్।
దీనులబ్రోచుబాంధవవిధేయుడుడస్సియువేడబోడుతానూని
వేశ్యతోడుత నియోగికినిచ్చినదాన మల్పమే॥

ఇందొక్కడేని సత్యము గనిపింపదు.

మానఘనుండు = ప్రభువులకు సుఖప్రదాయి యగుటచే నొప్పుకాబోలు.
బ్రహ్మకులమండనమూర్తి = తపస్స్వాధ్యాయంబుల దగులపెట్టి సేవకత్వముశేకొని బ్రాహ్మణ్యము బుగ్గిచేయుటచే బ్రహ్మకుల మండనమూర్తియే.

పరోపకారి = నియోగులలో నాయకులకు పరోపకారియే.

పుగ్గానమరన్నదుల్ గొనదు = రాజుకడననుగ్రహణసమయమునను గాదేమో

దిప్పడుస్వామిహితోపకారముల్ = రాజు యొక్క స్వార్థములు నెరవేర్చు నట్లు చెప్పినమాట నిజమేగదా ?

చెల్లకోయదాంధ్రవరిదేయుడు = కరణములపట్ల వైదికులపట్లను దీను ద్రోహము వనుట నిజము.

వక్ష్యయు కేవలోకు = కీ॥శే॥ సమయను చాటుపద్యమణి మంజరిలో యీపద్యము కనుక ... పద్యము గలదు.

సీ॥ అవనిలో బ్రాహ్మణ శ్రేష్ఠులై సమహాత్ములు పండితోత్తముల్ |
భువనములుంబురంధరులు పూజ్యులు వారలటుండ కూటికై |
నవనవకల్పనావిధి చణత్వము దోప నబద్ధమాడు నీ |
కవులిలదాన పాత్రులయి గౌరవమందుట చూడ వైచిత్రముల్ ॥

వేరుగ జెప్ప నక్కరలేదు.

ఈ మధ్యకాలము నందలి మంత్రివర్గము నియోగులే యగుచుండిరి. యెందుచేతననగా ? క్షత్రియసార్వభౌములగు చక్రవర్తుల యనంతరము సామాన్యప్రభువులు రాజ్యము పాలించుచుండిరి. స్వేచ్ఛావిహారులును నిరంకుశులును విషయలంపటులును క్రూరులుగను నుండుచుండిరి. మనవారు కొందరు ఇట్టిప్రభువులు మహాత్ముదీయులని యందురుగాని, అందరిలోను నున్నారనుట యెదగును. కొందరు రాజులు సాధుపురుషులై కపటమెఱుంగని వారుగ నుండిరి. అట్టియెడల మంత్రులు యెట్టి వారుగనుండిరన. అప్పటిలో విద్యావివేకము యోగ్యత గని పెట్టి మంత్రియుద్యోగమిచ్చుట లేకపోయెను. ఏపనియులేక, వృత్తి యేదియుగానక, ప్రభువులకడ జేరి వారి యభిమతానుసారులై చరించుచూ కాచియుండి ప్రగ్గడలగుచుండిరి.

అట్లు మంత్రులైనవారు నియోగులేయనదగు. ఎందు చేతనన. ప్రభువులు తమకు మంత్రిగావలెనని కోరకున్నను జీతము భత్యము యేర్పరచకున్నను తమంత తాము మెల్లగా నాశ్రయించి మంత్రులుగనై మరియు నారాజులను తమకు వశపరచుకొనుచు పెక్కుయుక్తులచే తమచేతులలోని క్రీళ్లబొమ్మలవలె నాడింపసాగిరి. నితరజాతులవారెల్లరును వారివారి విద్యలచే నేర్పరులై జీవించువారైరి. వైదికులును తమ వృత్తియగు పౌరోహితముగాని పంచాంగముగాని లేక పురాణకాలక్షేపములచేతగాని జీవించువారుగ నుండిరి. ఇట్లన్ని జాతులవారికిని జీవనాధారకములగు వృత్తులు గలిగియుండుటచే ప్రభువులు బిలువపంపిననే వారికడకు జనవారైయుండిరి. నియోగులన్న నట్లుగాక మహారాజుల నెప్పుడును ఆశ్రయించుకొని వారి గోర్కెల నెఱింగి నెరవేర్చి తమలాభము తాముబడయుచుండిరి. మంత్రిపదవియున్నను లేకున్నను నమాత్యబిరుదము కలిగియే యుండెడివారు.

బ్రాహ్మణుని నైష్ఠికధర్మములమాని ధనంబుపై మనసెపుడాకర్షింపబడెనో అప్పుడే సేవకత్వము సందవలసె.

ఇదిగనియె కాబోలు. వేమనగారు.

ఆ॥ జాతివారలెల్ల ♦ జాతివిద్యలునేర్చి
జాణలైరి తెలివి ♦ జగతిలోన
బ్రాహ్మలైనవారు ♦ బ్రహ్మవిద్యెరుగరు ॥ విశ్వ ॥

అక్షరజ్ఞానము లేనివారుకూడ శాస్త్రీనామధారులగుచున్నట్లు మంత్రి యమాత్యపదములు దోకలవలె దగిలించుకొని వీరాంజనేయుల ప్రతిభ వెలుగజేయుచుండిరి.

ఎట్టి నౌకరీలో నున్నను, ఎట్టి ప్రభువును గొలచినను ఎంతజీతము పుచ్చుకొను యుద్యోగమైనను సేవకత్వమేయగు. సేవకత్వమె శూద్రత్వము. యిది రాజకీయోద్యోగములనబడు.

ఒక వైశ్యునికడనుండి సేద్యముచేయుట అమ్మకము కొనుగోలు మొదలగు పనులు చేయుచున్నప్పుడు వైశ్యసేవకోద్యోగములగును.

ఒక శిల్పియొద్ద చక్రము ద్రిప్పుట, సమ్మెట వేయుట కరుగుట కాచుట మొదలగు పనులలోనున్న శిల్పిసేవకోద్యోగములగును.

నీళ్లకావళ్లుమోయుట, వంటపనులుజేయుట శుచిస్థళము లలుకుట, మడిబట్టలారవేయుట, శుభలేఖలు బట్టుకొనిపోవుట ఇత్యాదులు విప్రశేవకోద్యోగములు.

కర్తకొరకు యజ్ఞపశువును జంపుట, శవవస్త్రపరిగ్రహణము, శయ్యాపాయసభక్షణము, యాచనము, నీచోద్యోగములగును.

కొఅతవేయుట (ఉరిదీయుట) శిరచ్ఛేదము చేయుట, హింసించుట మృగవధము యివి రాజాజ్ఞచొప్పున వేయబడినను చండాలోద్యోగములనబడును.

స్తోత్రపాఠములతోడను, ముఖస్తుతులతోను, పరాకులతోను జీవించువారు కొందరుందురు. యీతెగలు ప్రభువుల నెప్పుడును జుట్టుకొని యుందువారు. వందిమాగదులు బట్టులు మొదలగువారు.

ఇట్టి బృందము పరివేష్టింపబడి వినోధంబుల కాలంబు గడుపు ప్రభువులకడను తదనుచరులగు మంత్రుల సాహోయమూ

నను, కాలంబుఁ జాలకుండ ప్రజాక్షేమంబుల విచారించుటకును, దేశసౌకర్యంబుల నిర్ణయించుటకును, దేశాభ్యుదయకరవిద్యల నాదరింప నెట్లుప్రాప్తమగు. ఇట్లగుటచేతనేగదా మనపూర్వముున్న మహాశిల్ప విద్యలెల్ల క్షీణించి కడకు విదేశములపై నాధారపడవలసిన గతి ప్రాప్తమైనది.

ఇది యిట్లుండ మంత్రులయొక్క కార్యములు గనుము. రాయనభాస్కరమంత్రి.

సీ॥ ఆవుపొడ్చినయర్థి లేపకుండగనిచ్చె
వలవేసిదీసిన వానికిచ్చె
గుడిప్రాసియాగిన గొంటికొంటుపకిచ్చె
ప్రార్థించి భుజమెక్క బట్టుకిచ్చె
మొగసాలజిచ్చిడ్డ తగవరికొలిచిచ్చె
నిలుచూరవేడిన నెసగనిచ్చె
ప్రాణముల్ వేడిన ప్రాభవంబుగనిచ్చె
భార్యనువేడినఁ బరగనిచ్చె॥

యీయిచ్చు బొగడికెల కంతములేదు యర్థమునులేదు.

ప్రాణముల్ వేడిన ప్రాభవంబుగ నిచ్చె నిది యెంత యద్భుతము. యెమిస్తినో యిస్తినన్నట్లుగా భార్యను అడిగినను ఇచ్చెను. ఇఁక యివ్వరానిదేలేదు. ప్రాణమేయిచ్చిన పిదప భార్యనిచ్చుటయెట్లో మంత్రులగుటచేత ననేకోపాయములుండ వచ్చును యీభాస్కరమంత్రి దానము లింతియేగాదు.

సీ॥... బాలకులకును బాలసత్రముకామసత్రమువిటగ్రామణులకు. బళిబళి! దాతయన్న నీతడేయగు. ఇట్లు పొగడినపండితులు ను పొగడదగినవారే, యిట్టివారి నడతలు చదివిన లోకము

చెడక నుండునా ? నాదెళ్లయయ్యానమంత్రి ఫోర్జరీలు చేయు టయందు గొప్పమంత్రి. కొండమంత్రి భాస్కరుని పుత్రుడగు టచే నీయనయు మంత్రి. రామలింగభాస్కరుడు ఇతడు భా స్కరమంత్రికి మనుమడగుటచే నీయనయు మంత్రియే.

యథాబీజః స్తథాంకురః. ప్రభువును ప్రభుత్వమును సం భందము లేకున్నను మంత్రిపదము మాత్రము మానకుండిరి.

సీ॥ వాకిటకావలి జోకతోనొనరించి దివ్యకీర్తి వహించె

తిక్కమంత్రి.

సువారమునందున్న కూరగాయల రామమంత్రియు మంత్రియే నిట్లు మంత్రులను ఎందరినైన జెప్పవచ్చును. కందు కూరి రుద్రకవి " మంగలికొండోజి మేలుమంత్రుల కెల్ల " అనుట యూరకేయగునా ?

## ఎచ్చోగల్.

ఆకాలమున నాప్రభువులకడ నట్టి యాటలు సాగినవి గాని యిప్పుడీ ప్రభుత్వమున (బ్రిటీషువారి పరిపాలనమున) వీరి కుతంత్రములు, సాగగలవా? యనిగొందరు సందేహింప బనియే లేదు. ఇదె యుదాహరణము చూడుడు. 1903 వత్సరము నందు ఆంగ్లేయపాలనమందు శాశననిర్మాణసభలో నొకవైష్ణ వుండున్నంతనే తమజాతికి ఆచార్యశబ్దము గలుగ నీవిశ్వబ్రాహ్మ ణులకును నుండదగునా ? యనియోచించి మోర్వారేమి విశ్వ బ్రాహ్మణులు ఆసారియని అపశబ్దమును వాడుకొనవలసినదని

శాశనతీర్మానము గావించెను. ఒక్కరుడుండినంతనే యింత యుపశబ్దమును ధర్మనిర్ణయముగావింప పైసభికులలో పెక్కుమంది వీరేయైయుండిన నెంతేసికార్యములు చేయకుందురు. వీరికి 400 వత్సరములనాడు ఆచార్యనామమును మొదలుబెట్టి దగిలించుకొనుచున్నవారు. విశ్వబ్రాహ్మణులు వేదకాలాను గుణ్యమైయున్న యమూచార్య, శిల్పాచార్యాది నామములు యిప్పుడీయనగారికి కనుపొప్పకున్నంత మూసనగునా? ముందొచ్చిన చెవులకంటె వెనకవొచ్చిన కొమ్ములు వాడియగుట వినమా? యీవైష్ణవజాతిలో "అపశబ్దభయంనాస్తి" యను మాట యెల్లరెఱింగినదియేగదా? ఆచారి అనుటకు ఆసారి యని వాడుకొనవలసినదని శాశించిన నీయన ప్రతిభయాశ్చర్యమును గలుగింపకపోదు. వేయిగన్నులుగలిగి మెలుగుచున్న నీ ప్రభుత్వమువారి చూపును బ్రమింపజేయు నాయుపేయుల ప్రజ్ఞ పొగడదగినదియే.

వైష్ణవులలో వీరు పూర్వమువడగల్, తెంగలు అని రెండు విధములైన పంగనామములవారు. వీరిలో నధికులైన వారు నపశబ్ధభయంనాస్తియను సిద్దాంతముచే ఎచ్చెగల్ అను మూడవదేగ నేర్పడినది. గావున నీఎచ్చెగలు శాశనముదవ్వక దగులుకొనియున్నది. విశ్వబ్రాహ్మణులకును వీరి పంగనామములు బెట్టుటకు ప్రయత్నించిరిగాని అదిఅంటుకొనలేదు. ఎచ్చెగలు సాంప్రదాయకమువారు ముందు పెచ్చుపేరిగి ప్రకాశింతురుగాక. ఇంక నిట్టి యపశబ్దశాశన నిర్మాణంబులుచేసి ఎచ్చెగల్ వారు కీర్తిని బొందుదురుగాక.

మంత్రి మహానాడు అను పూర్వశాసననిర్మాణసభికులే. యిపుడు ఎచ్చెగల్ దేగవారై ప్రకాశించుచున్నారు. పూర్వము రాజులకు చెప్పవపుడొక విధముగను, తాము లిఖించునది మరియొక విధముగను, ప్రభువుల కెఱుకలేకయే గొన్నియు, పూర్వమున్నదానిని దీసివైచి అందు మరియొకటి కల్పించియు పెక్కుభంగుల మార్పులుజేసి, పూర్వధర్మములనెల్ల దల్లక్రిందులుగ నొనర్చుటచే ప్రజ్ఞామంతులగువారికి నీనామము నామకరణము చేయబడినది. అదియే ఎచ్చెగళు పాపము శమించుగాక.

## కళింగము గజపతి.

(కరణీకోద్ధారిణియను నీగ్రంథమున)

కం॥ శ్రీరాజమహారాజ
శ్రీరాజితకందనూల్పూర్ వరభాండా
గార ప్రభుత్వపద సం
చారా కృష్ణమ్మశెట్టి జననాథమణీ ॥

క్రిష్ణమ్మ, శెట్టియనుటచే నీయన వైశ్యుడనదగదు బలిజశెగలోనివాడై యుండవచ్చును. యీ గ్రంథము క్రిష్ణమ్మశెట్టికి అంకిత మివ్వబడినది.

తే॥గీ॥ చిత్తగింపుము భవదాజ్ఞ శిరమునందుఁ
దాల్చి కరణీకములు విప్రతతికివచ్చి
నట్టి వృత్తాంతమంతయు ననువుపరతు......

దీనినిబట్టి క్రిష్ణమ్మశెట్టి ఈగ్రంధమును రచింపగోరినట్లును, యా శెట్టి యుత్తరవు ప్రకారము కరణీకములు విప్రులకు యెట్లువచ్చి నదో తద్విధానమెల్ల కవి చెప్పబూనెననియు ననుటచేత అంతకుపూర్వము విప్రులకు కరణీకములు లేవని దేలుచున్నది.

తే॥ గీ॥ సకలసంపత్సమృద్ధి ప్రశస్తమగుచు
మించిన గళింగభూమిఁ బాలించువారు
వన్నెకెక్కిరి గజపతివారనంగ
బెక్కుగజయూధములనేలు బిరుదువలన ॥ 4

సమస్తసంపత్తులచేతను సమృద్ధియై మించినటువంటి కళింగదేశమును పాలించుచున్నవారునగు గజపతివారు. (అనేక యేనుగల సముదయములు గలిగియుండుటచే గజపతివారను బిరుదము గలిగినది.)

కం॥ ఆవంశామృతజలనిధి
జైవాతృకుడనగ సకలసంస్తుత్యకళా
సేవధిగణపప్రభువరు
డావిర్భవమొందెఁగువల యానందముగన్ ॥ 5

గజపతివారి వంశమున గణపతి మహారాజు కలిగెను. యీ గణపతి ప్రభువునుగూర్చి దెలసికొనుటకుముందు వీరి కళింగ దేశమునుగూర్చి కొంత విచారింపవలసియున్నది. కళింగము మిక్కిలి పురాతన నగరమై యున్నట్లు మన పురాణములును దేశచరిత్రములును జెప్పుచున్నది. ఇప్పటి కాలమున నిది గణనీయముగ గన్పట్టకున్నను ఆంధ్రదేశమునకెల్ల నాయకత్వము వహించినదియై నాగరికావతంసమునై యుండెను. బలికి సుదేష్ణలకు దీర్ఘదాముని వరముచే ముప్పైరు పుత్రులు గలిగిరనియు,

వారు అంగ, వంగ, కళింగు, లనియు కడపటివాడగు కళింగుని నామమున నీకళింగదేశము నిర్మింపబడినట్లును మహాభారతము బహ్మపురాణము, పురాణనామచంద్రిక మొదలగు పాణినీయ సూత్రములుకూడ దీనిని పేర్కొని యున్నది.

కళింగాధిపుడు రుక్మిణికి సహాయమొనర్చి బలరామునిచే పరాభవింపబడినట్లు విష్ణుపురాణమునందు గలదు. కళింగ చిత్రాంగదుని కొమార్తెను దుర్యోధనుడు వివాహమాడెనని శాంతిపర్వమునగలదు. గంగాతీరమునకు దక్షిణము గొంత వరకు తామ్రలిప్తమును దానికి దిగువ నుత్కళమును దానికి దిగువ కళింగమును గలదని జెప్పియున్నారు.

హంటరుగారు, మహేంద్రమాలకు దిగువనున్న గంగా నదికి దక్షిణమున 474 మైళ్లదూరమున కళింగరాజధానియగు కోరంగి గలదని వ్రాసియున్నారు.

ఉత్తరకళింగమే యుత్కళమనియు మధ్యసీమ కళింగ మనియు కళింగమే తెలుగుదేశమనియు చైనా యాత్రికుడగు "హ్యూయానిత్సాంగు" చెప్పియున్నాడు.

కళింగమునకుత్తరమున వైతరణీనదియు, దక్షిణమున గోదావరియు, తూర్పున సముద్రమును, పడమట వారిప్పా సామంతరాజ్యములు నుండినట్లును, రామాయణ భారతకాల మునందు కళింగము ఉత్కళము వేరువేరుగా నుండినవనియు, మనోమోహనగంగులేగారి సిద్ధాంతము.

క్రీస్తుశ॥ పూర్వము 800 వందల యేండ్లకుముందు కళింగము యవద్వీపమునకు చక్కని యోడవర్తకము జేసినట్లును, సమస్తవిద్యల పేరొందినట్లును, ప్రాచీన కట్టడములు అందలి

చిత్రములు సాక్ష్యము లిచ్చుచున్నవనియు, పాతనాణేములపై హిందూ చిహ్నములున్నవనియు, సర్. యే. పి. ఫైరీ చెప్పి యున్నారు. "ఐనీఅక్బరీ" లో కళింగము ప్రశిద్ధపట్టణముగా వర్ణింపబడియున్నది.

ఇప్పుడు గంజాంమండల దక్షిణమునగల "కళింగపట్టణ" మను చిన్నరేవును, ఉద్యానములనబడు తోటలలోని కాళింగు లును, శ్రీకాకుళప్రాంతముల బండ్లుతోలియు వర్తకముఁజేసియు జీవించు " కింతకాళింగులును, మనదేశములోని వైశ్యులలో నొక తెగవారగు కళింగకోమట్లును, కళింగసామ్రాజ్య చిహ్న ములలోని భాగములేయగు " బౌద్ధులు బాధితులైయ్యును విడువక నీసీనుల నివసించుచునే యుండిరనియు క్రీ.శ. 75 సం॥ ముల కొందరు కాళింగులు సాహసించి బైలుదేరి నావలపై జని, యవద్వీపముజేరి అచట వారిని నాగరి కులనుగా జేసిరని ఎలిఫెన్స్టోన్ గారు వ్రాసియున్నారు. నావి కులు బ్రాహ్మణమతస్థులని హ్యూయినత్సాంగు వ్రాసియున్నాడు.

శ్రీశంకరాచార్యుల యద్వైతవిజృంభణకాలమున కళిం గుల పరిమితముగ జేరి తమబౌద్ధమతమును కాపాడుకొనిరనియు జెప్పియున్నారు.

క్రాపర్ట్ పెర్గూసన్‌గారు. హర్షవర్ధనునికాలమున కళిం గము శశాంక మహారాజు స్వాధీనమున నుండినదనియు, రాజ నరేంద్రుని మనుమడు కళింగమే లినట్లును కన్నడపు "రాఘ శే ఖరవిలాసమున " రాజరాజుని కొడుకు గంగయ్య కొండచో ళుడు తన సేనాధ్యక్షుడగు కరుణాకరతొండమనుని పంపి కళిం గమును సాధించెనట. క్రీ. శ. 1001 వత్సరమున రాజరాజ

నేనని దెలియదగును. అందలి ప్రజలు దుర్మార్గులుగనుండుటను బట్టి యనినను రాజుకే చెల్లవలసియుండును. రాజా రాష్ట్రం కృతంపాపం, యీవిచార మక్కరలేక యీ వెనుకటి పద్యము బాగుగ జెప్పియున్నది.

గణపతిభూవరునిచే జైనులను మిక్కిలి భాదింపబడినట్లును, 36 జయన గ్రామములు దగులపెట్టించి పాషాణార్చినట్లును, చరిత్రకారులు వ్రాసియున్నారు. ఇట్టి మహాకటిక కార్యములు, ఇట్టి ఘోరకృత్యములు, తిక్కనసలహావలన జరిగినట్లు సోమదేవరాజీయము మొదలగు కొన్ని గ్రంథములవలన దెలియుచున్నదని ఆంధ్రుల చరిత్రమున జెప్పబడియున్నది. పీనుగాక గంగయసాహిణియను నొకప్రధానిగలడనియు ఇతడు హైదరాబాదు రాజ్యములోని నల్లగొండజిల్లాలోని పానుగల్లు మొదలు మార్జవాడి వరకునుగల తెలుగు దేశమునంతను ప్రతినిధియై పాలించెననియు, కడప మండలములోని పులివెందలతాలూకా, మోపూరు, మొదలు మైసూరురాజ్యము చింతామణితాలూకు మిండిగల్లువరకును, కడప, కందనూలు, అనంతపురము, బళ్లారి, నెల్లూరు, గుంటూరువరకును పాలించినట్లును జెప్పబడియున్నది.

పై జరుగబడిన యంశములు దెలసియే కాబోలు మహాత్ముడగు వేమన

చచ్చిపడిన పశులచర్మంబు కండలు
బట్టిపెరికిదినును పరగగద్ద
గద్దవంటివాడు గణపతిగాడొకో॥ వి॥

ముఖప్రీతిగా ముచ్చటలాడక కలిగినమాట ఘట్టిగా జెప్పునట్టి మహానీయుడీయన యొక్కండే. గణపతి అనంతరము వేమన

గారు తన మనస్సునకెంతో వైపరీత్యముగ దోచుటచేతనే యీ పద్యమునదిట్టినాడు. అట్టి గణపతినిగూర్చి వీరభద్రకవి వర్ణించిన,

సీ॥ గణపవరాఖ్య పట్టణములై దొనరించె
నాడాడ నిజవిషయాంతరముల
గణపసముద్ర విఖ్యాత తటాకముల్
గావించె సొంతిత్య జీవనముగ
గణపేశ్వరాఖ్య లింగప్రతిష్ఠలొనర్చె
భక్తిప్రయుక్తి దత్పట్టణముల
గణుతింప శఖ్యంబుగాని సర్వాగ్రహారము
లొనగూర్చె సద్బ్రాహ్మణులకు.

ఆంధ్రుల చరిత్రములో గణపతిరాజు లింగ ప్రతిష్ఠలును తటాకములును మొదలగునవి గావింపలేదనియు, గణపాంబవలన చేయించినవి గొన్నియు దరువాతివారు గొన్నియు గట్టించినట్లు చెప్పబడెను. చరిత్రలనుబట్టి యోచింప యీ ప్రభువుచేసిన ప్రతిష్ఠలు నాల్గవపాదము మాత్రము నిజముకానున్నది.

## మంత్రి మహానాడు.

గజపతివారు అను బిరుదము రాకముందు వీరి యింటి పేరు మిరియాలవారనిన్ని మొదటి ప్రభువే గజపతి నామము గల రాజనియు దరువాతివారికి గజపతివారన్న నామము బిరుదమయ్యెననియు చెప్పబడినది. బుక్కపట్నం రాఘవాచార్య కృతమగు ఆంధ్రదేశచరిత్రమును దంతనాల నాగేశ్వరశాస్త్రులవారికి మచిలీపట్నములో తమబంధువుల ఇంటిలో లభించినవని నా కొసంగిరి. అందలి కొన్ని యంశములు జూపుచున్నాను.

గణపతి మహారాజుకడనున్న మంత్రులలో గోపరాజు రామన్న మిక్కిలి యుపాయశాలియనియు, వీరిలో వెలినాడు వేగినాడు, మురికినాడు, కాసలనాడు, పెసలవాయి, తెలగాణ్యం, నందవరీకులు, మొదలగు తెగలవారు గలరనియు, వీరలకు జీవనోపాధులులేక కొందరందరు రాజుల కొలువులందు ప్రవేశించి యదియొక వృత్తిగా నేర్పరచుకొనిరనియు, ఇందు పెసలవాడు (పెసలవాయి) శాఖీయుడగు గోపరాజు రామన్న గారు దేశీయులగు విశ్వకర్మీయులు జైనబౌద్ధమతస్థుల పక్షము గానుండుటచే ద్వేషముగలవారై కరణీకములన్నియు యుపాయమున లాగివేసెనని చెప్పబడియున్నది. యిదిసారాంశము. మరియు శా. శ. 1067 సం॥ రాక్షాక్షి వత్సర బాద్రపద బ 15 లు. గొప్ప సూర్యగ్రహణము కలిగినప్పుడు క్రిష్ణలో స్నానము చేయుచున్న గణపతి మహారాజును దానముగోరి యేను ఘడియలు మొహరు తనకు దయచేయవలసినదిగా, దారాదత్తము చేయించుకొనెను. (దారాదత్తం బనగా నిచ్చినది స్థిరమని దెల్పే గుర్తుకొరకు హిందువులలో ప్రతిగృహీత చేతిలో దాతనీళ్లు వదలుట.) ఇది యీకాలపు రిజష్టరు చేసికొను పద్ధతికంటె ఘట్టియని చెప్పవచ్చును.

చాళుక్యరాజులున్నంతవరకు దక్షిణ ఆంధ్రదేశమంతయు గజపతివారి స్వాధీనము గాలేదనియు గజపతి వంశీయులలో నొక కోవవారు 11 శతాబ్దమున ఆక్రమించుకొనినట్లు చెప్ప బడియున్నది. ఇందు విశ్వంభరదేవు గజపతి. 2 గణపతిదేవు. 3 నరహరిదేవు. 4 విశ్వంభరదేవు. 5 బాలభాస్కరదేవు అని యీనామములు గన్పించుచున్నవి. కొండవీటిచరిత్రమున కళింగ

రాజ్యాధిపతియగు వీరభద్రగజపతిని యీయన కొడుకైన కొండవీటిదుర్గమున కధిపతిగనుండిన వీరభద్రగజపతిని 1515 స॥ జయించి కర్ణాటరాజ్యముతో గలుపుకొన్నట్లు గలదు. గావున పై పేరులు క్రమముగా నున్నట్లు దోచదు.

ఆ ప్రకారం 7 ఘడియలకాలము మొహరునుపొంది తాను యాజ్ఞ్యవల్క్యుడగుటచేత తన యాజ్ఞ్యవల్క్యులగువారి అర్జీలు ముందు మొహరువేసి తరువాత యితర నియోగులందరి యొక్క దరఖాస్తులమీద ముద్రవేయుచుండగా 6000 మందికి అగునప్పటికి 7 ఘడి॥ కాలము పూర్తికాగా రాజుకు ముద్ర యొప్పగించ వలసివచ్చినది గావున యీ తెగవారు ఆరువేల వారనియు. యాజ్ఞ్యవల్క్యులగువారు ముందుగా (ప్రథమము న) హెూదాలు పొందినందున ప్రథమశాఖవారనియు గురుతుగా వాడబడి యదియే వాడుకలో స్థిరపడినదని వ్రాసిరి. ఆరువేలుగాక యాజ్ఞ్యవల్క్యులగు వారెందరో తెలియదనియు వీరందరుకాగా కొన్ని గ్రామములు పూర్వమున్నవారే కొద్దిగా నిలిచిరనియు జెప్పియున్నది.

కరణీకోద్ధారిణిలో వ్రాయబడిన శాసనమును యడియు (దీనిలోనున్న) శాసనమును నొకేవిధముగా నున్నదిగాని, యాజ్ఞ్యవల్క్యులన్న పదము మాత్రము యిందులో నెక్కువగా నున్నది. ఇట్లు కరణీకములు వచ్చిన తరువాత మెల్లమెల్లగా ప్రతిగ్రామములోను వీరి హెూదాలుహెచ్చి తరువాత కొన్ని యేండ్లకు ఒక విధమైన శూద్రజాతివారిని మాలవారిని తోడు చేసి (పాతకరణముల) విశ్వబ్రాహ్మణ వంశీయుల నందరిని మిక్కిలిగా బాధింప మొదలు బెట్టిరనియు, పిదప రానురాను

పెక్కుజాతులవారిని వశపరచుకొని తమ శక్తినెల్ల వినియోగ పరచుచూ నొక్కొకమెట్టుగా వంచింది వారి మాట సాగకుండ జేసిరి. అప్పుడును మాదిగెగొల్ల (గమల్ల) తురకలు మొదలగువారు మాత్రము యీ క్రొత్తకరణముల మాటవినక వొప్పికొనక పోవుటచే వారలనందరిని వేరుచేసి తమతోకలసిన వారలందరును గలసి మహానాటివారన్న పేరు (రాయనబాస్కరమంత్రి కాలముకు) స్థిరముగా నేర్పడజేసినట్లును అదిమొదలు వారిఇండ్ల శుభకార్యములకు కూడా నెవ్వరును పోకూడదనియు వారి యిండ్లలో నెవ్వరయినా అన్నము వగైరాలు దినగూడదనియు వారలకు ఎట్టి సహాయములును చేయరాదనియు ఇట్లు అనేకవిధములైన కట్టుబాట్లుచేసి దేవతలనాటి శాపము గలదనియు సమాదానముజెప్పి హింసింపనాగిరి. 7-8 వందల సంవత్సరముల నాటినుండి తరతరములుగా బడుచున్న యీవంచన ప్రస్తుతము ప్రభుత్వము జేయుచున్నటువంటి ధర్మనిర్ణయకర్తలగు ఇంగ్లీషువారి పరిపాలన చక్కగా వ్యాపించిన తరువాత నీవిశ్వబ్రాహ్మణులు హాయిగా నిర్మలమై సుఖమనుభవించుచున్నారు. మంత్రిమహనాటి మహిమ యీ బ్రిటీషు ప్రభుత్వము ముందర సాగినదిగాదు. రాయనమంత్రి కాలమున మిక్కిలిగా బలపడెను. రామన్నగారు యిప్పించిన కరణీకములుగాక తరువాత మెల్లగా ప్రవేశించిన వైదికులే కరణకర్మలని పిలువబడు చున్నారనియు, యేయేగ్రామముల కెవ్వరెవ రేర్పడినది. గ్రంథ బాహుళ్యభయమున వ్రాయబడలేదనియు, కర్నల్ మెక్యాంజిధొరవారి హిందూగ్రంథసంగ్రహమను పుస్తకములో పైవివరములు కనుపించును అనియు జెప్పియున్నది.

అప్పట్లో నీకరణీకపు హోదాలు బ్రాహ్మణులకు కలిగి వున్న జిల్లాలన్నియు గోపరాజు రామన్న మంత్రి కాలమునాటి వని చెప్పదగివున్నవి. యేవనగా, నెల్లూరు, కడప, కందనూరు, ఇనకొండ, బళ్లారి, హైద్రాబాదు రాజ్యములో ఓరుగల్లు ప్రాంతము, కృష్ణా, గోదావరి, విశాఖపట్నము, గంజాం మొదలుగా గలవి.

తక్కిన శిస్తుదస్తుల వాటి యేర్పాటులును గురించి ఒక రాజు కాలములో నిర్ణయమైనది. మరియొక రాజు కాలములో రద్దు చేయబడుచుండినవిగాని ఈకరణీకపు హోదాలు మాత్రమేప్రభుత్వ కాలమందును ఇంతవరకును రద్దుచేయబడలేదు.

కొందరు తాము చేయజాలక కరణీకపు హోదాలమ్ముకొనగా వైదికులు కొందరు కరణములైరి.

గజపతి గణపతుల పరిపాలన స్వల్పకాలమైనను రాచకార్యపు మార్పులు చాలాకలిగినవి. అనగా, పూర్వపురాజుల కాలములోవున్న పద్ధతులకు భిన్నముగా దుగ్గిరాలవంటి గ్రామాదుల క్రొత్తగా యేర్పరచుటయు దానికి హద్దులతో కొంత భూముల కలుపుటయు చుట్టుప్రక్కల గ్రామాదులకు పొలిమేరలు హద్దులు యేర్పరచుటయు, తత్పూర్వ మున్నవారిని నిలకడపరచి నియోగ కరణీకములు యేర్పరచుటయు, శాశన దృష్టాంతములవల్ల వీరి హయాములో మార్పులు జరిగినట్లు కనుపించినది. యీగజపతివారు శా. 11 వ శతాబ్దము మధ్యను యీ తెనుగు దేశము యేలిరి. అయితే వోరుగల్లు సంస్థానము

---

వీరలు శిల్ప మాధారమైనందున నీ అల్పశేవకత్వమునకు మరల యత్నింపనేలేదు.

వారు హనుమకొండ సీమను ప్రభలియుండుటచేత 11 శతాబ్దము ఆకరుగాక మునుపే గజపతివారి ప్రభ తగ్గినట్లు తోచును. వీరు ముఖ్యముగా 1056 మొదలు 1067 సంవత్సరములలో విజృంభించి యున్నట్లు నెం ర్ల శాశనములవలన దెలియుచున్నది. గనుక ఆకాలములో ప్రబలి తరువాత తగ్గినది. హనుమకొండ సీమను పోలురాజును అటుపిమ్మట రుద్రదేవరాజున్నూ యీ శఖాబ్ద ప్రారంభమునుంచి క్రమక్రమముగా వృద్ధియగుచున్నట్లు కాకతీయ సంస్థాన చరిత్రలవలన దోచుచున్నది. ఆ శాశన దాఖలాను 1070. 1148. శకములలో రుద్రదేవరాజు ప్రతిభగానున్నట్లు యేర్పడును. వోరుగంటి వారికిన్ని (కోటకేతి రాజులు) ధరణికోట సంస్థానీకులకున్నూ బంధుత్వము కలిసి యున్నది. కోటకేతరాజుకు గొంకరాజు తోబుట్టువు భార్య కోటకేతరాజుకు కాకతి గణపతి కుమార్తె గణపాంబ భార్య యని ప్రతాపరుద్రుని శాశనమునందు తెలియుచున్నది.

యిట్టి విషయంబులబట్టి యీ తెగవారందరును సమానులును బంధుగులునై యుండుటచేత యెట్టి కార్యములునేని చేయగలిగి యుండిరని మాత్రంచెప్పి యింతటితో ముగించుచున్నాను.

## క్రిష్ణాజిల్లా స్థానిక చరిత్రము.

### క్రిష్ణాడిస్ట్రిక్టు మాన్యుయల్ 342 P చాప్టర్ XI.

క్రిష్ణా డిస్ట్రిక్టులో కరణములందరు సామాన్యముగా నిప్పుడు బ్రాహ్మణులే అయ్యున్నారు. కడపా, నెల్లూరు, గోదా

---

శాశనము నెం ర్లలో అని వున్నది. సంఖ్య అందు గనిపించుటలేదు

వరి జిల్లాలోను యిదేమాదిరిగానే యున్నారు. యీ బ్రాహ్మణకరణములు తమిళసంతతియనియు చోళరాజులతో 1112 శతాబ్దములలో వచ్చినటువంటి వారి సంతతియనియు, డాక్టరు బర్నల్ ధొరవారుజెప్పిరి. కాని ఆ బ్రాహ్మణులు స్వయముగా తాము అందుకు భిన్నముగా జెప్పుచున్నారు. ఎట్లన ముక్కంటి పల్లవునియొక్క ఆహ్వానమున వారణాసినుండి వచ్చినవారమని చెప్పుదురు. వీరి రాక యెట్టిదైనను, ప్రతి గ్రామములోనూ శతాబ్దములనుండి కరణములై యుండుటచేత కావలసినంత ప్రాముఖ్యత యేర్పడియున్నది. యీకరణములందరు నాలీష్టు దాకలాలోని వంశీయులుగనే జెప్పుచున్నారు.

1144 సం॥ అక్టోబరు నెలలో సూర్యగ్రహణ స్నానసమయమున తన దివాను అగు బ్రాహ్మణుడు ఎదురుపడి యొక దానము నడిగెననియు, అందుమీాదట రాజు 7 ఘుంటలవరకు తన రాష్ట్రముపైని యధికారము చెలామణి చేయవచ్చునని దానఅధికారము నొసగినట్లును అందుమీాదట సమయము కని పెట్టి ప్రతిగ్రామముయొక్క కరణీకము తన కులబ్రాహ్మణుడే యగునట్లు నియమించెననియు తాను సొంతముగా నాపనిని నెరవేర్చుటకు పూర్వమే 7 ఘుంటలకాలము సమాప్తమైనందున కొన్ని గ్రామములు మిగిలిపోయినవనియు, అందువలన నాయా గ్రామములు కొన్ని బ్రాహ్మణకరణములు కాకుండిరనియు చెప్ప బడినది.

పైచరిత్రలోని విషయములకును దీనికిని సరిపోవుచున్నది. అయిన స్రీబ్రాహ్మణులు వారణాశినుండి వచ్చినవారైన మత్స్య భుక్తులై యుండవలయును గదా యన్న సందియము దోచెడు.

మరియు పైస్వర్తితస్తుపక్షద్వయమును [illegible]పద్య లోను, ముప్పది ఇద్దరు మంత్రులకు చరిత్రమునకు... శాసన శ్లోకమును గనుడు.

## శా శ న ము.

శ్లో॥ శ్రీమాన్ గణపతిర్భూపో గజపత్యన్వయోద్భవః అస్మిన్ భూమండలే తస్యబహవస్సంతి మంత్రిణః గోపరాజా స్వయోఽమాత్యో రామాభ్యో గణికాగ్రణీః గణకానాం హితార్థాయ సద్యశస్థాపనాయచ యావచ్ఛశిమార్తాండౌ తావత్కాలే వివర్థయత్ గోత్రశాస్త్రాంబ రేందూనాం సంఖ్యాబ్దే శాలివాహనే రక్తాక్ష్యబ్దె భాద్రదర్శేచ అర్కగ్రహణకాలికే తేనరాజ్ఞాగృహీద్దానం కృష్ణవేణీ తటేతథా, గ్రామస్థావర వృత్తీనాం సాక్షిణః సర్వదేవతాః ధర్మమే తత్కాలాయేన చాక్షిప్తం చదురాత్మనా షష్టివర్ష సహస్రాణిజాయతే ఖరయోనిషు॥

పై శాపశ్లోకమున నేదురాత్ముడైన తమ కరణీక జీవనమునకు భంగము గావించెనేని వాఁడు ఆరువేల సంవత్సరములు గాడిదె కొడుకై బుట్టవలయునట !! ఆహా !! ఇంతపాఁడు శపథమున కోర్చి, ఇంత పాపకార్యమునకు దెగించి ఎవడును చేయజాలడు గాని ముందు తామదేవనిని జేసినందులకై విచారింపవలసి వచ్చినది. యీ శ్లోకము పెక్కుచోటుల నుదహరింపబడి యున్నది.

ఇన్ని వేలమందిని, ఇన్ని వేల కుటుంభములను, ఒక్కపరి యాయము గోడుకుడవ జేసినందులకు పై శాపశ్లోకషష్టివర్ష సహస్రాణి నెన్నిసహస్రంబులుగా జేయవలెనో దెలియరాదు. యీగణిత మాపండితులే జెప్పవలయును.

కొండపీటి చరిత్రమున నిట్లు చెప్పబడినది.

" ఎన్నియో శతాబ్దములనుండి విశ్వబ్రాహ్మణు లనుభవించుచున్న కరణీకముల నన్యాయముగా నొక క్షణమున దీయించిన గోపరాజు రామప్రధాని " అని యిన్ని గ్రంథము లిట్లు వాకొనుచుండ. ఆంధ్రులచరిత్రమున రామప్రధానిచేసిన కృత్రిమమును జారవిడిచి గణపతి ప్రభువే నియోగుల యందభిమానమున నిచ్చెనని వ్రాసిరి రాజునకు నియోగులపట్ల దయయుండిన విశ్వబ్రాహ్మణుల నోటికడ జీవనమును బెటికి నియోగుల కివ్వవలయునా? వేరుజీవనోపాధి జూపలేక పోయెనా? నిష్కారణముగా విశ్వబ్రాహ్మణుల కపకారము చేయుననుట రాజుపై నిందమోపుటయ్యెగాని వేరుగాదు.

మరియు ఆంధ్రుల చరిత్రమున "విశ్వబ్రాహ్మణులని చెప్పికొను కంసాలులని" వ్రాయుటకేమి కారణము. విశ్వబ్రాహ్మణులు గామను కంసాలులుగలరా! యీగ్రంథకర్తయు మహానాటివాడేనని దెలియుటకొరకే గావలయును.

యీ నియోగికరణములకు పూర్వమున్న కరణములను గూర్చి, కొంత విచారింతము. (మహారాష్ట్ర చరిత్ర 2 ప్ర. 26 పేజి.) " ప్రతిగ్రామమును ఒకచిన్న రాష్ట్రముగ నేర్పడి, దానిలోపలనే పరిపాలన వ్యవహారమును స్వతంత్రముగ జక్కపెట్టుకొనుటకు తగిన రాజ్యాంగములను కలిగియుండెను. అంగడి కలిగిన గ్రామమునకు " కస్బా " యనియు అంగడిలేని యూరునకు మోజా యనియును పేరు. దేశములోని భూమియంతయు, అగమ్యమైన అరణ్య పర్వత ప్రాంతములు దప్ప యేదేనొక గ్రామమునకు చెందియుండును. భూమి సరిహద్దు

బును, ఆక్రమణలును, సాగులును గ్రామలెక్కలలో నమూదు చేయబడియుండును. ఈలెక్కలన్నియు తయారు చేయునతడు గ్రామలేఖకుడని పిలువబడును. ఇతనినే కులకర్ణియనియు నందురు. మనవైపున కరణమనుపదము నిందుకొఱకుపయోగింపబడును. గ్రామమునకు పెత్తనదారి (అధికారి) పటేలనియును గ్రామాధికారియనియు జెప్పుదురు. వీరిద్దరిచేతను గ్రామమునకు గావలసిన అవసరవృత్తులు, కమ్మరి, వడ్రంగి, కుమ్మరి, కాపలివారు మొదలగువారలతో గ్రామవ్యవహారములన్నియును నెఱవేర్పబడుచుండును. వీరలందరికిని దగిన యినాము భూములుండును. పటేలు సామాన్యముగా క్షత్రియుడుగాని శూద్రుడుగానియైయుండును పటేలు కరణముల మాన్యములు హిందూధర్మశాస్త్రప్రకారము అన్నదమ్ములు పంచుకొనదగినవై యుండును.

కావున సామాన్యముగ చిన్నచిన్న భాగములుగ విడిపోయి పలుకుటుంబములకు జేరుచుండును. ఇట్లు భాగము లను భవించు వారందఱును పటేలులమని పిలుచుకొందురు. ఇందు ముఖ్యముగా గ్రామాధికారము చేయునతడు మొఖద్దమని పిలువబడును. గ్రామలేఖకుడు సామాన్యముగ బ్రాహ్మణుడును పరబూగాని విశ్వబ్రాహ్మణుడునై యుండును.

(ముకసఫ్) పటేలు వ్యవసాయమును కనుగొనుచు, గ్రామరక్షణకును అప్పుడప్పుడు వారి సంతోషమునకును గావలసిన బనులను చేయుచుండును. గ్రామములోనేదేని తగాయిదాలు వచ్చినప్పుడు నుభయపక్షములవారిని మందలించి బుద్ధిగఱపి సమాధాన పరుపబడుచుండును. అట్లు తీరని యెడల

పంచాయితీ నేర్పరచి వారిముందు పరిష్కారము చేయఁబడును.

సామాన్యనేరములు తమ గ్రామములోనే పరిష్కరింపబడుచుండును కొందరు దుర్మార్గులై నేరములు చేసినపుడు బండకొయ్యకు దగిలించియు దెబ్బలుగొట్టియు శిక్షింపు చుండురు అప్పటికప్పుడె పరిష్కారమగుచుండును. అంతకంటె పెద్దన్యాయహత్యలు బందిపోటులు మొదలగుమించిన(కేసులు) నేరములు ప్రభుత్వమునకు దెలియఁజేసి దోషులగువారిని శిక్షించుటకు సహాయులగు చుందురు. అట్లుండియు గ్రామాధికారులు గర్వితులుగాక తమ గ్రామక్షేమమే ప్రధానాంశముగ దలంపుగలిగి వర్తించుచుందురు. ఆ కాలమున గ్రామాధికారియు కరణమును ప్రభుత్వమువారు నియమించిన వారుగాక వంశక్రమాగతముగా నుండువారు. ఒకప్పుడు గ్రామాధికారి చదువురానివాడై యుండుటయు గలదు అట్టియెడ కరణము సర్దుపాటు చేసికొని వ్యవహరించు కొనుచుండువారు. ఇట్లన్యోన్య సహాయమున తమ కార్యముల లోపము గలుగనీక చక్కబరచుకొనుచుందురు.

కరణముయొక్కపని శిస్తు వసూలుచేయుటయు లెక్కలు వ్రాయుటయునై యున్నది. ఇదిగాక ఎగుమతి దిగుమతుల మీదను, అనేక చిల్లర హంశములలోని పన్నులకును, జమాబందీయనియు నందురు. పటేలు కరణములకును రాజునకు మధ్య నొకయధికారి యుండును. దేశాధికారి యందురు.

కరణము పటేలు అనువారికివలె మాన్యములు దేశాధికారికి యుండదు. కరణము పటేలులు మిక్కిలి అన్యోన్య

ముగ సహాయ్యులై కలసియే యుందురు. గ్రామమునందును దేశమునందును వారసత్వముగవచ్చు స్థిరాస్తి హిందూరాజ్యములో వతననియు మహారాష్ట్రమున, వతన్, అనియు పిలువబడును అట్టి గౌరవనీయమగు వతనులు గలవారిని, వతన్దార్, అను పేరున బిలుతురు. ఈ వతనుల యెడల మహారాష్ట్రుల యభిమానము విపరీతము. వతనును పోగొట్టుకొనుట మానము పోగొట్టుకొనుటగా వారు జూచుచుందురు. ”

యిట్టిస్థితిలో వీర్శ్వబ్రాహ్మణ కరణీకవతనులను పోగొట్ట బడినప్పటి వారిక్షోభ మిక్కిలి విచారకరమైన దనుటకు సందియముండ నేరదు గదా ?

అప్పుడు రాజకీయ సామాజిక జీవనములలో గ్రామావసరములగు కార్యములకు ననసరములగు వర్ణములుగ యుండును. సంఘము దారుఢ్యమై యుండుటదకుదగినన్ని జాతులే కల్పింపబడియుండెను అనవసరములగు జాతి మతములులేవు.

స్మార్తులు, వైష్ణవులు, శిష్టాచారులు, భ్రష్టాచారులు, లింగధారులు, అంగధారులు, యిట్టివంతగా నాదేశముల గానరావు, అనియు మహారాష్ట్రచరిత్రమున జెప్పబడియున్నది.

అంతకంటె పూర్వము కరణము మునసబులే గ్రామమున కధికారులై యుండువారు. పటేలు పెత్తనదారిగా నుండును. కరణము లెక్కలును వ్యవహార సంభందమైన వ్రాతలును తన పనిగా యుంచుచుండును. మొత్తమునకు ప్రభుత్వమునకు చెల్లింపవలసిన పన్ను మొత్తము గ్రామము నందలి రయితాంగము భూముల రకములనుబట్టి ఎవరెవరెంత చెల్లింపవలయునో వీరే నిర్ధారణ చేసికొనుచుండువారు.

కొండవాగులునుండియు చెఱువులనుండియు కాలువలు మొదలగునవి సముదాయముమీద మరమ్మతులు వగైరాలు చేసికొనుచుందురు.

చెఱువులు మొదలగునవి గొప్పవారును ప్రభువులును త్రొవ్వించినట్లు గనుపట్టుచున్నది.

ఆస్థామి వారిభూములు స్థిరపంపకములు చేయబడని కాలమున చరపంపకములుండెడివి. అనగా చీట్లువేసి ఎవరికి వచ్చినది వారు. అయిదు సంవత్సరములు సాగు చేసికొను చుందురు. 10 సంవత్సరములు సాగుచేసి యనుభవించు కొను పద్ధతులునుగలవు. యేయూరి పొలమాయూరివారికే హక్కుగా యుండుచుండెను.

రాజు యెచ్చటనుండునో ఎట్లుండునో సామాన్యముగా ప్రజలెఱుగకనే యుండుచుండిరి.

దీనినిబట్టి మతములన్నియు పూర్వము దేశావసరమై గలిగినట్లును. వీరశైవము, రామానుజము ఇట్టివి అనవసర మత ములు తరువాత బుట్టినవనియు దేలుచున్నది.

మహారాష్ట్రమునను విశ్వబ్రాహ్మణులు కరణములుగా నున్నట్లును వారివతెనుల విలువయు జెప్పబడినది.

యిట్టి మతములచేతనే దేశ మైకమత్యమదుగంటి చెడు టకు కారణమైనది. యొక్కొక తెలివిగలవాడు తనకు జీవనా ధారముకొరకు కొన్ని పిచ్చి ఆచారములు యేర్పరచి ప్రజలను నమ్మించి బ్రమింపజేయుచుందురు. వారికదియే జీవనమగు చుం డును. యీమధ్య క్రిష్ణాపశ్చిమదేశమున నొకడు తనశరీరమును నాకుటచే ఫలితము కలుగుననగనే వాని శరీరమంతయు నాక

జొచ్చిరి. పాపము కపటమోయుంగని పామరులు జెప్పినదెల్ల నమ్ముచుందురు.

## మాచాబత్తునివారి కరిణీకములు.

"పంచాంగములు పోయినను నక్షత్రము లుండవా" అనునట్లు రామప్రధాని మోసమునకుఁ జిక్కుపడక యిప్పటి నెల్లూరి మండలములోని వేంకటగిరి సంస్థానములో బచ్చలకూరపాడు, చిన్నారికట్ల, పెద్దారికట్ల, నాయునపేట, గుట్టగట్టు, ఇరసలగుండము, యాచభూపాలము, కెలంపల్లి, సామంతపూడి, నాగంపల్లి, వింజవుర్తి, చినమనగుండము అను గ్రామములు మాత్రము విశ్వబ్రాహ్మణ కరిణీకములు గలిగియున్నవి. వీనిలో కెల్లంపల్లి గ్రామమున కెల్లంపల్లివారును సామంతపూడి గ్రామమున సామంతపూడివారును దక్క తక్కిన పది గ్రామములలోను మాచాబత్తునివారలే కరిణీకములు చేయుచున్నారు. మంత్రశాస్త్రములందును, లౌకికప్రచారములందును మాచాబత్తునివారిప్పటికి జగత్ప్రసిద్ధివహించియున్నారు. వీరిచరిత్ర విషయమై దండకవిలలో నీక్రిందిరీతి దెలియఁదగి యున్నది. నెల్లూరుజిల్లా పొదిలెతాలూకాలోఁ జేరియున్న యీపైగ్రామములలో కొప్పోలువారను విశ్వబ్రాహ్మణులు కరిణీకములు జేయుచుండువారఁట. హైదరాబాదు నబాబుల పరిపాలన కాలములో పదిరెండు సంవత్సరముల కొకతూరి జమాబంది చేయుచుండువారఁట. ఒకపర్యాయము జమాబందికి బచ్చలకూరపాటి నివాసియగు కొప్పోలు మాచయభక్తుడను నొక కరణము వెళ్లవలసి వచ్చినదఁట. జమాబందికి వెళ్లినవారు

రమారను సంవత్సరములపాటు హైదరబాదులోనే నివసింపుచు దుద కెట్టులో దర్శనముచేసుకొని వచ్చుచుండుటయు నాచారముకలదఁట. మాచయభక్తుఁడును కొంతకాల మక్కడ నివసించియుండి హుజూరువద్ద లెక్కలను విమర్శించుతఱి నొక్కసారి చిత్తాకవిలెపుస్తకమునుమఱచి బసకుఁజేరుచుండఁగా హుజూరాపుస్తకమునుజూచి దాఁచి మాచయభక్తుని తిరుగ బిలుపించిరఁట. మాచయభక్తుఁడును దనపొరపాటు తెలిసికొని వీధిలో నొక యలేఖ్యపుస్తకమునుకొని హుజూరునకు జేరెనఁట. హుజూరువారా మాచయభక్తునిఁజూచి చిత్తా తెచ్చినావాయని యడుఁగ దెచ్చినాననని తనవద్దనున్న యలిఖిత పుస్తకమును విప్పి చదువ నారంభించెనఁట. రహస్యముగ హుజూరువారు తమవద్ద మఱచిన పుస్తకమును విప్పి చూడఁ దొడఁగిరఁట. వ్రాయనిపుస్తకమునుజూచి మాచయభక్తుఁడు చదువుచు నొక్కచో నొకింతకాల మాఁగెనఁట. ఆగుటకుఁ గారణమేమని హుజూరడిగిన ప్రభూ! ఇక్కడ నొక పంక్తి కొట్టివేసియున్నదని చెప్పెను. మొదటిపుస్తకములోఁగూడ నట్లే కొట్టివేసియున్నదఁట. ప్రభువప్పుడు మాచయభక్తుని చేతిపుస్తకమును బరిశీలింపఁగా నేమియు వ్రాయని శూన్యగ్రంథముగఁ గన్పడ, నీయనయవధానమునకు మెచ్చుకొని పెక్కు బహుమతులొసంగినఁ దెచ్చుకొని మాచయభక్తుఁ డిప్పటి మాచాబత్తుని వారందఱకుఁ గూటస్థుఁడై నెగడెనని చెప్పుదురు మాచాబత్తునివారను గృహనామ మీమాచయభక్తునివలననే వచ్చినదందురు.

బచ్చలకూరపాటినివాసులలో మాచాబత్తుని యంబయ్యగారను నంబోపాసనాపరుఁడు మిగుల ప్రఖ్యాతి గడించెను. ఇప్పటికి సరిగా నూటపది సంవత్సరముల క్రిందట బచ్చలకూరపాటిలో రామలింగేశ్వర దేవాలయము గట్టించి తన మంత్రశాస్త్రిప్రభావమువలన నప్పటి వేంకటగిరి సంస్థానాధిపుల మెప్పించి చాలభూములు దేవాలయమునకు సంపాదించియిచ్చెను. ఇంకయు మఱికొంద ఱక్కడక్కడ వీరిలో ప్రసిద్ధకార్యములు చేయుచునే యున్నారు.

కెల్లంపల్లివారును ఇట్టివారే. ఇప్పటి కెల్లంపల్లిగ్రామ కరణమగు శ్రీయుత, కె. కోటయ్యగారికి బితామహుఁడగు వీరయ్యగారును కెల్లంపల్లెలో నొకశివాలయ ప్రతిష్ఠాపన జేసిరి. ఇప్పటి కోటయ్యగారును దానధర్మశీలురై యనేకకవులచే నుతింపఁబడుచున్నారు.

ఈసమయమున నింకొక యద్భుతగాథ చెప్పవలసియున్నది. కెల్లంపల్లి దేవాలయ ప్రతిష్ఠాపకులగు కెల్లంపల్లి వీరయ్యగారు కరణీకము జేయు దినములలో దాదాపు ఎనుబది సంవత్సరముల క్రిందట మహాసాధ్వియగు పోతులూరు వీరబ్రహ్మముగారి మనుమరాలగు నీశ్వరమ్మగారచ్చోటికి విచ్చేసిరఁట. వారి సన్నిధానమున బ్రతిదినమునను వందలకొలంది జనులకు సమారాధనము జరుగుచునే యున్నదఁట. ఇట్లుండ నొక్కదినమున మధ్యాహ్నసమయమున నాజ్యమురా నాలస్యమగుడు, ఆమహాదేవి యజమానునిపిలిచి యన్నా! యాలస్యమేమనియడుగ, తల్లీ! యాజ్యమొక్కటియె తక్కువయైన నిందులకింత తడవాయని గ్రామతటాకమువద్దకేగి యీశ్వరియాజ్ఞ యైనదని రెండు

కుంభముల యాజ్యమడిగి చెంబులో ముంచుకొని తెమ్మనఁగా, మహాప్రసాదమని యాయజమానుఁడట్లు సేయఁగా నుదకకుంభములు రెండును బుగబుగలాడు ఘృతపరిమళముతో నిండి యుండ వాని నాసమారాధన కుపయోగించిరఁట. పిమ్మట నేతికావడి రాఁగా నాదేశితో విన్నవింప గంగాభవాని కర్పింపుమని సెలవియ్య నారెండుకడవలఁ జెంబునీటిలోఁ గలుప నాజ్యసంజ్ఞగానిపింపక నీటిలో నేయి కలిసిపోయెనఁట.

ఈమహాత్మ్యము గన్నులార చూచితిమని కొందఱు వృద్ధు లిప్పటికిఁ జెప్పుచున్నారు. మహానుభావుల చరిత్రలు దుర్జ్ఞేయములుగదా ! (ప్రబోధిని 7 సంపు॥ 10 సంచిక.)

## కరిణీకోద్ధారిణి.

ఇంక నీప్రసక్తి యట్లుంచి కరిణీకోద్ధారిణీ గ్రంథమునకు వత్తము.

కం॥ ఆగజపతివంశోదితుఁ
డౌగణపప్రభుని మంత్రియసదృశనయవి
ద్యాగోపమంత్రి వివిధ
ప్రాగల్భ్యుఁడు గోపరాజు రామన వెలయున్॥ 9

గణపతి ప్రభువరునికడ మంత్రిగానుండినట్లు యిందు చెప్పియున్నదిగాని వెనుకటి కథాసందర్భములబట్టి సందియము దోచెడు.

సీ॥ ఆదిశాఖాన్వవాయక్షీరపాదోధి
సంపూర్ణ రాకానిశాకరుండు ॥ 10

యిందునబట్టి ప్రథమశాఖవారని స్థిరపడుచున్నది.

మ॥ సకలవ్యాపకుఁడై యమాత్యపదవీ సామ్రాజ్యగౌరేయుఁడై ।
ప్రకటక్ష్మాతలనాథ కౌశలిగుణప్రావీణ్యుఁడై విద్విష ।
త్ప్రకరశ్రీహరణోపయోగ చతురప్రాగల్భ్యుఁడై ......॥11

తన వైరులసంపదల నపహరించుటయందు మిక్కిలి నేర్పుగలవాఁడగునని చెప్పినదెంతయు నైజముగనేయున్నది.

చం॥ అనుపమభోగభాగ్యము లనేకము లనుభవంబున నిట్లు కాలయా
పనమొనరించితిన్ మదినభంగురమై తగుముక్తిహేతువున్
గనుఁగొనవైతి నైనఁ ద్వరగాఁజని దక్షిణదివ్యదేశ ద
ర్శనమొనరించి వెంకటధరాదరవల్లభుఁజూచి వచ్చెదన్ ॥ 14

అనేకవిధములైన భోగభాగ్యము లనుభవించుచు కాలమువృథగా గడపితిని స్థిరమగు ముక్తిహేతువును విచారింపనైతిని గావున నిక త్వరపడి ముక్తికొరకు దక్షిణదేశ మహాస్థళంబుల దర్శనముచేసి వేంకటేశ్వరుల సేవించి రావలెను.

ముక్తిహేతువులగు కార్యములు ఇదివరకును చేయలేదట యింతటినుండి మొదలుపెట్టుటకై యత్నించి ముందు తిరుపతికి వెడలి అచ్చట ముక్తి గ్రహించి తన కార్యములకు పూనుకొనును కాబోలు. ముక్తిమార్గము అన! నారామన్నగారికి తిరుపతి కంచి మొదలగు చోటుల దిరుగుటయే.

స్వపోషణము, అన్యపీడనము గలవారు ఇట్టి చోటులకేగి ముక్తి గొనిదెచ్చుకుందురు.

ముక్తియన=విడుదల ఇట్లే బంధము మోక్షమును అనగా తత్పూర్వము మనము బందింపబడియుండుటయు నాబందనము. విడిపోవుటయె మోక్షము అనబడును. అనగా మనకేమి బందము గలదు? దేనిచేత గట్టబడియున్నాము? అనియోచింప.

అరిషడ్వర్గములచేతను, తాపత్రయములచేతను, ఈషణత్రయం
బులాదిగాగల బంధనములచే గట్టబడియున్నాము. యిట్టి బంధ
ములు విడిపోవుటయే ముక్తి, లేక మోక్షము, అనబడును.
ఎచ్చటికిబోయిన నీముక్తికలుగునో రామన్నగారి ముక్తి లౌకిక
ముక్తి ద్రవ్యయుత ప్రవృత్తిమార్గము ముందు దెలియగలదుగాన,
విరమింపవలసె.

శ్లో॥ కురుతే గఙ్గా సాగరగమనమ్ వ్రతపరిపాలనమథవాదానమ్
జ్ఞానవిహీన స్సర్వమతేన ముక్తిమ్ నభవతి జన్మశతేన.

మ॥ సకలద్రవ్యపరంపరాభరిత పేటీజాల పూర్ణంబులౌ
శకటంబుల్ వెనువెంటరాఁగదలి సంజాతప్రమోదంబునన్
నికటగ్రామమునన్ వసించి యచటన్ నిద్రించి మర్నాటి రే
పకడన్ బైనముచేసి పోవఁదొడగెన్ బల్యంకికారూఢుఁడై ॥17

వ॥ ఇవ్విధంబున...పల్లెలు పట్టణంబులు...గనుంగొనుచూ
నిదురింపయానంబుల సహచరులంబడకలసిక నిరాయాసప్రయా
ణంబులఁ జనచూ...జనిచని

క॥ తిరువాత భటకదంబం
బిరువంకలఁగొలువ బుధహితసహితుండై
పురివిభవముఁ జూచుచు సు
స్థిరగతినతివసతి నెగువ తిరుపతిఁ జేరెన్ ॥ 29

ఇంతదూరము మిక్కిలి సుఖులై ప్రయాణముజేసి తిరుపతికొండ
నెక్క పట్టెను.

చ॥ కదలిప్రయాసయంచనకఁ గాంతయుఁదానును బాదచారులై
మురమెదఁ బిక్కటిల్ల నిరుమూఁడునగంబులదాటి వాటిపైఁ

గుదురుగనున్న శేషగిరిగోపురదర్శన మాచరించియా
నదియ వికుంఠ మంచని మహాస్థలి జాగిలిమ్రొక్కి యంతట॥
పాపము మార్గమంతయు సుఖముగాఁ బ్రయాణముజేసి ఆరు కొండలు పాదచారులై మిగుల ప్రయాసమునను కష్టమునుకొనక సతియుర్ దానునను నడచి గోపురదర్శనముజేసి అదిగో వైకుంఠ మహాస్థళమని జాగిలిమ్రొక్కి తరువాత పల్యంకికాదుల కొండ క్రిందనే విడచిబెట్టిరో లేక వెంటనే వచ్చినవో తెలియరాదు. యీ కొండ లెక్కునపుడు పాదచారులై నడచిననే పుణ్యమని యనేకులు నడచుచుందురు. కొందరు కొంతదూరము నడచి కూలీల మాట్లాడుకొని డోలీల నెక్కి జనుచుందురు.

ఇల్లు జవి

సీ॥ బలభిచ్ఛిలాన్విత ప్రాకారఘటితంబు
గోమేధికోజ్వలద్గోపురంబు
మాణిక్యదృతముఖ మండపోపేతంబు
రమ్యపుష్కరణీ విరాజితంబు
గారుడాశ్మనిబద్ధ కల్యాణనిలయంబు
స్వర్లోకదర్శి తాంచధ్వజంబు.

యీవర్ణనము మన కవులకదాటియై యున్నది. ఆవగింజంత పందున్న గుమ్మడికాయలు దూర్పగలరు.

ఇంద్రనీలమణులచేఁ గట్టబడిన ప్రాకారములు. గోమేధికములచేఁ గట్టబడిన గోపురములు. పచ్చలుదాపిన కళ్యాణ మంటపములు. మరకతమందిరములు. కలియుగ వైకుంఠముగా నున్నదని వర్ణించుటచేత ఇట్టి వర్ణనములు నిజమును చెడగొట్టుచున్నవి. యెట్లుగట్టబడియున్నదియో యేప్రదేశమెంతరమ్యముగ

నున్నదియో దాని స్వరూపము యిందువలన నెంత మాత్రము భోదపడ నేరదు. కాలయాపనములును అర్థరహితములును అగును.

ఇంద్రనీలములులేమి ? ప్రాకారములేమి. గోపురములు గోమేధికములతో కట్టుటయా ? యింతకంటె పనికిమాలిన వర్ణనలుగలవా ? అతిశయోక్తిగాచెప్పినను నిజమును దెలుపు చుండవలయును. మనకవుల కిదియొక పూర్వాచారము గావు ననే మనదేశచరిత్రములు నైజముగను సత్యముగను నుండుటను కొనదగి యుండవు.

ముందైనను కవులు వర్ణించుటలో లేనివిజెప్పి స్తుతించుట కంటె వున్నదియున్నట్లు వర్ణించుటే మిక్కిలి యాదముగానుండు ననియు లాభకారియగుననియు మహాకవుల ప్రార్థించువాడను.

ఒకగృహమును వర్ణించునపుడు బంగారు గోడలనియు, పొగడముతో చేయబడిన ద్వారబంధములనియు పచ్చలుదాపిన దలుపులనియు లేనిపోని వర్ణనములు చేయుటకంటే నాయిల్లు ఇంత వైశాల్యము గలదనియు, నిన్నిగదులు గలదనియు, నందలి యలంకారమును సౌకర్యములును గట్టింపబడిన వారి యుదార తయు శిల్పవిద్యావిశాలతయు నున్నదున్నట్లు జెప్పిన వర్ణనయే విలువగలిగియుండునని నా యభిప్రాయమేగాక ఆంగ్లేయపండి తుల యభిప్రాయమునై యున్నది.

మ॥ హరిపూజా పరతంత్రుఁడై యచట నత్యాసక్తిచేగొన్ని వా
సరముల్ నిల్చి నగంబుడిగ్గి విమల స్వాంతంబునంజూచె ని
త్యరమావాసము వైష్ణవోచిత సమస్తగ్రంథ తత్త్వార్థ వి
స్ఫురణాభ్యాసమునైనయ త్తిరుపతిఁ శోభాయమానోన్నతిఁ ॥41

యీ పద్యమునుగనుము. నిత్యరమావాసము, వైష్ణవ, ఉచిత, సమస్త గ్రంథ తత్వార్థ విస్ఫురణ అభ్యాసము అయిన తిరుపతిం జూచెఁ తిరుపతికిన్ని విశేషణములు కాదు. తిరుపతిలోన్న వారికి గావచ్చును. అట్టి తిరుపతిని జూచుటచే నీయనకేమి ఫలితము? విశిష్టాద్వైతము గనుపించెనా? మరల వెనుకటివలెనే రెడ్డివాచ్చె మొదలుపెట్టుమని 29 వ పద్యమునే మరల

ప॥ తరువాత భటకదంబం
బిరువంకల గొలువ బంధుహిత సహితుండై
పురిశోభవము జూచుచు సు
స్థిరమతి నలమేలుమంగ సేవించుటకై॥ 42

అలమేలు మంగాపురమునకు బటకదంబం బిరువంకల గొలువ బయులు వెడలెను. అనగా కొండదిగగానే మరల బటవర్గము కొలుచుటలు గలదని దెలుపబడెను.

తరువాత

క॥ సంచిత పుణ్యంబున నతఁ
డంచితమణి సౌధగోపురాలంకృతమై
మించిన ధరాపురంధ్రి
కాంచశమయకాంచిఁగాంచిఁ గాంచి నుతించెఁ॥ 47

సంచిత పుణ్యంబున, కంచిని గాంచెను.

"నగరేషుకాంచి" యనుటనుబట్టి సుకృతంబున్నగాని, నీయన నాకంచి నగరము గాంచజాలడు.

పురంబునగల స్త్రీవర్ణనలో

సీ॥ అనిమిషలోక నిత్యావాసమెదరోసి ధరణికి
దిగిన యచ్చరలగుంపో
చపలాభిధానంబు సడలింపఁగాఁగోరి మురిపెంబు
జూపెడు మెరుగుల గుమెు
శృంగారమునను విరించి శిల్పుఁడు పురిని దిరుగ ని
ర్మించు చిత్తరు ప్రతిమలో
యువసర్వగర్వాప నోదనంబునకుఁగా య
జూడఁపు సంమోహనాస్త్రచయమొ

గీ॥ తెరవెడలిబైట గనుపట్టి సరసమలర
నెమ్మిజూపెడుజంత్రంపు బొమ్మచాలో
యనఁగ సౌందర్య గరిమనొయ్యార మొలయఁ
బురిఁజరింతురు పరుపంపు బూవుబోండ్లు.

ఇందలి వర్ణనమునకేమిగాని "విరించి శిల్పుఁడు" అనుపదము విచిత్రముఁ గొలుపుచున్నది.

శిల్పాచార్యుల రావించి యని యున్నచోట శిల్పివరుల రావించి యని దిద్దుపాటు పలనాటిచరిత్రమున జేసిన మహానాటివారి మహిమ.

శాస్త్రిల వారింకను దిద్దవలసిన గ్రంథములు చాల యున్నవి.

మ॥ చిరముఁ ఫాలతలంబునన్ దిరుమణి శ్రీచూర్ణ రేఖాత్రయిన్
గరమూలంబున శంఖచక్రములుగాఁగన్పట్టు చిహ్నంబులన్
అరుతన్ శ్రితులసీవినీల నళినాక్షాలోల హారంబులన్
బరికింపందగు వైష్ణవోత్తములనెన్నంబాపముల్ బాయు వేఁ॥54

పై జెప్పినట్టి వైష్ణవచిహ్నములు ధరించినవారి నెన్నగానే పాపములు పాఱిపోవునట. ఆకాలమున నిప్పటివలె నాటక శాలలులేవు కాబోలు. నాటకములో వైష్ణవపాత్రము గాంచిన సంతకంటె నెక్కుడు పాపములైనఁ బాఱిపోవచ్చును.

మరియు శివకంచికిఁజని

కం॥ ఏకామ్రాధీశ్వరునకు
సాకల్యముగాఁగ నమక చమక నిరూఢా
స్తోకాభిషేక మొనరించి
యేకాగ్రమనస్కుఁడగుచు నెదుట నిలుచుచున్ ॥ 73

పూజించి మరికొన్ని మహాస్థళంబుల శైవ వైష్ణవక్షేత్రంబుల సేవించి యగణ్య పుణ్యంబార్జించి "మరల కతిపయప్రయాణంబుల స్వకీయ నగరాభిముఖుండై వచ్చుచూ" 82

కం॥ మాదలయను గ్రామంబున
వైదికగృహమునను దనదు వైఖరిజన సం
మోద మొనరింప విడిసె మ
హీదేవామాత్యమణి సుహృత్సంయుతుడై ॥ 83

వచ్చుచూ దారిని మాదలయను గ్రామంబున దన సమాన సాత్వికప్రచారుండని బిరుదముగల నొక వైదికుని గృహంబున బస జేసెను.

వ॥ ఇట్లు విడిసి సుస్నాతుండై రేపటిదినంబున మదీయ పైత్రికంబగుటంజేసి మిమ్ముల నియమించెదనని తన సహచరుల యందిరువురిని తృతీయస్థానంబున నాయింటి బ్రాహ్మణుని నియమించి, మరునాఁడరుణోదయంబున మేల్కని జలంబులంగ్రుంకి సంధ్యావందన ప్రముఖ కాల్యకరణంబులం

దీర్చుకొని తదుచిత సామగ్రి సంపాదకుండై యుండె నంత॥ 84

తే॥ ఆపుర గ్రామణిత్వ సర్వాధికార
విశ్రుతుండగు కంసాలి విభ్రమాతి
శయముగలవాడు కలవాడు భయములేక
పేర్చి సరకారుపని నెరవేర్చువాడు ॥ 85

ఎచ్చోగళు సాంప్రదాయక లక్షణము ఇచ్చట గనుపించు చున్నది. చూడుడు.

ఆయూరి కరణీకసంభందమైన సర్వాధికారముల విశ్రు తుండైన కంసాలియట. కంసాలి యనగా స్వర్ణకారుడు కర ణమును గూర్చిన ప్రసంగమున నీయధిక ప్రసంగ మేలగలిగెనో దెలియరాదు ?

గణికుడును లేఖరియునగు కరణమునుగూర్చి జెప్పినప్పుడు కంసాలియని జెప్పవలసినపని గాన్పింపదు. కంసాలి = బంగారు పనివాడు. కంచరి = లోహాకారుడు. కమ్మరి = యినుపపని చేయువాడు. యిట్టి పనివారల ప్రస్తావనజేయ బనియేమి ? య్యాకరణము బంగారుపని జేయుచుండెనా ? లేదు. కరణీక వృత్తిగలవాడు గదా? కులమును జెప్పదలచిన నది కులనామ మ్మున్ గానేరదు. మ రెందుకిట్లు జెప్పవలెను. మహానాటి లక్షణము. మరియు నింకొక విశేషణము. విభ్రమాతిశయ ముకలవాడట ! ఎవడు ? విభ్రమ మెవనికి గలదో అతిశయ మెవనికి గలదో చదువరులు గమనింప నర్హులు.

మరల కలవాడు. ఏమి, కలవాడు. లేక ఇంకే మయినను కలవాడో దెలియరాదు. ధనము కలవాడు

విద్యగలవాఁడు లేక వీరికి గావలసిన దెదియొ యదిగలవాడు. పోనిండు. భయములేక పేర్చి సరకారుపని నెరవేర్చువాఁడు. పోర్జరీలును, లంచములును, నెఱుంగని వాఁడై యుండ వచ్చును. అందుచే భయమనుట లేనిమాట నిజముగా నుండదగును సరకారుపని నెరవేర్చువాఁడు అనగా సర్కారుపనికి ఎంత వ్యాఘాతమును చెఱుగులేక నెరవేర్చువాడనుటయు బాగుగానే యున్నది

కం॥ బలసి యిరువంకలను గా
పులు కావులు సేయుచుండ ముందరఁ దాటా
కుల కవిలెలుగొని మొహతా
దులు సెట్టికడీలు నడుమ దురదురవచ్చెన్॥ 86

దురదురవచ్చెన్ అను నీయనుకరణమేమియో విచారింపవలసి యున్నది 29-42 పద్యములలో జటకదంబం బిరువంకలగొలువ ననుచోట దురదురవచ్చెన్ అని నామంత్రిపదవికిఁ దగిన శబ్దముగాని యిచ్చో ననుపయోగము.

తే॥ వచ్చి చావడి జిలుచాపపైనఁ గూరు
చుండి మొహతాదులను నెఱాజూచిపలికె
నేఁడుసరకారుపైకంబు నేరుపరచి
ముల్లెగట్టక లేచుటఁ గల్లసుండీ॥ 87

అని మఱియు నిట్లనెనట.

కం. మఱయూరి బాపనాతఁడు
చనువరివలెఁ డక్కుఁజేసి జరుపుచు నున్నా
డని వార్యస్థితి వానిం
గొనితెండిచటి కని పలికెఁ గోపమెలర్పన్. 88

తే. ఇట్లుపల్కిన నొకఁడు వారింటి కేగి
యేమయా ! బాపనయ్య నేడేమొగాని
యాఁపదయ్యెడు పైకమీఁయకయపోవఁ
గదలనీయడు నిన్ను మాకరణమయ్య. 89

నేను పైకమివ్వక కదలనివ్వను అని ముందుగ నేజెప్పి మరియు వెంటనే నాతనిని దోడ్తెచ్చె.

చ. అనికొని తెచ్చి యాకరణమాతని ముందట నుంచినఁ హాలో యల్, దొనకగ గోటమీసములు దువ్వుచు నవ్వుచు గేలి సేయుచుఁ, ఘనులొ, మహాత్ములొ, నిజముకాని, యబద్ధ మటన్నమాట వా, కున దొరలంగనీయరటకుంభినికిఁ సుర లంట నిక్కమే. 90

కరణమాతఁడు బాపనాతని నిట్లడిగెఁట.

(తరువాత రామప్రధానిచే సంస్కారమైన కరణములు పన్ను లివ్వలేనివారిని, నెండలో నిలువబెట్టియు, పైని బండల నెత్తియు పలుభాదలు కాపులనుబెట్టి హింసించుచుండిరి.

ఆ దుర్మార్గము కొన్ని సంవత్సరముల క్రిందట వరకును బ్రిటిషువారిపాలన మారంభమై చక్కగా (వ్యాప్తిలోకి) శాశనములు అమలులోనికి రానంతవరకును నియోగికరణములు కాపులను బెట్టిన తిప్పలు దలచుకొన్న నెట్టవానికేని యొడలు భగ్గుమనకపోదు. పాపమా కరణము అట్టి బాధల బెట్టక వాక్పారుష్యముననే యడుగు చుండెను.) మీరు భూసురు లన్నది నిజమేని ! యిట్టి యబద్ధముల జెప్పవచ్చునా ? అని యడుగ వచ్చును, మీసములు దువ్వుచు నవ్వుచు గేలి సేయుచును, ననుట అసంభవము.

ఇంకను నిట్లడుగుచున్నాడు.

కం. ఎన్నివిధంబుల నినునే
బన్నీయమటంచుఁ బిలువఁబంపిన గృహమం
దున్నట్టుఁ దెలియనీయవు
వన్నియ చెపకుంక నిత్తువా యిప్పుడైనన్. 91

ఎన్నివిధములనో సీకరణమాత్రకు బాపనాతని, బతిమాలినట్లు పన్న నడుగబంప, నింటనుండియు లేదనిపించితివి. పరువు చెరచికొనక నివుడేని నిచ్చెదవా ? యని అడిగెను.

కం. ఆవును దెగనమ్మెదనని
రావలసినదున్నదని పురంబున నెవరో
యీవలెనని యొప్పందము
దేవలెనని టక్కు జేసితే నిది పోనా ?. 92

ఆ. పండినపంట పప్పు దప్పళముల
పాలు జేసి భూమిపాలుసొమ్ము
గ్రుద్దక్రిందఁ బెట్టుకొని మొద్దువలెనిట్లు
నిలువఁబడినఁ బాకి నిలువబడునె. 93

వ. అని యిత్తెరుంగున దనరంగున కనుగుణంబుగాఁ, ఇటదన రంగున కనుగుణంబు గానినిన రంగు. యెట్టి రంగు ; యేమి రంగు ? కవిత్వము రంగా కవి రంగా. ప్రథమ శాఖ రంగా. ఏచ్చొగలు రంగా. యీ రంగులెల్ల మిశ్ర మమై స్వచ్ఛమైన పలానారంగనుటకు వలనుపడదు గాని కరణమురంగు మిశ్రముగాని రంగు కాంతి దక్కువగనే యుండును. అంటుమామిడిపండు రంగువను రుచులయం దును ఇంపుగనే యుండును. ఎవరెరుంగని రంగు వేమన

యెఱుంగు నందురుగాని యీకాలమున నందరు నెరుంగుదురు. ఇంగ్లీషు జర్మనివారుకూడా కనుగొన్నరంగే. రంగునకేమి ఇంకను కొంచెము ముదిరిన, రంగు అంగుగా గనుపించును. తరువాత కథ గనుడు. బన్న దెమ్మని తన్నుఁద్వారిఁ బరిచిన నప్పరమసాత్త్విక ప్రచారుండగు పారుండు దారిద్ర్యదోషంబున సంపాదింప నొక వ్యవధి నిమ్మని వేడిన నమ్మాత్రకే జెవి జొరనీక యధికాగ్రహావేశంబున లేశంబైనఁ గరుణలేక ప్రేలుచుండెడ నేమియు ననజాలకుండునంత. 94

పరమ సాత్త్విక ప్రచారుండన పారులం దిట్టె వాడే గాబోలు

సర్కారుకు చెల్లించివేసిన శిస్తుపైకము యెంతకాలము నుండియో యివ్వక తాను గనుపింపక కనుపడినప్పుడు 82 వ పద్యములోని విధముగా టక్కరి మాటలు జెప్పుచూ ఇంట నున్నను లేదనిపించుచూ దాటోటూనర్చు నీపారుండు పరమ సాత్త్విక ప్రచారుండా? కరణమునకు కరుణలేక పోయెనా? పైగ ప్రేలుచుండెనా? ఔరా యెంతసాహసము? సరకారు పైకమున! కవి, కవిత్వమని తలంచె కాబోలు. ప్రేలుచుండుటకు యిది నగరిమేళమని యెఱుంగడు.

సీ. అరికట్టి కొన్నిదుర్భాలాపములదిట్టి
మొహతాడువాండ్ర జిమ్మానువెట్టి
చెయిపట్టియీడ్చి యిసీయావలకుఁబొమ్మ
టంచుఁ జెప్పండని యాజ్ఞజేసి
కుదుప మెచ్చటనైనఁ గుదిరి దెమ్మనిజెప్పి
తెగనమ్మి దెమ్మని మిగులఁబలికి

నాయింటి కిచ్చెదవాయని పచరించి
సరకారుసొమ్మని సాటిజెప్పి

గీ. సంధ్యఁజెప్పితి జంధ్యాలొసంగుచుంటి
వడుగు పెండ్లిండ్లు జేయించి యుడుగుకుంటి
ననుచు బ్రతిమాలుకొనిన నా! నా! నటంచు
వినక చావడిఁబెట్టె నవ్విప్రవరుని. 95

దుర్మార్గముగ చీవాట్లుబెట్టి, కుదువయుండి దెమ్మని. తెగనమ్మి తెమ్మని, నాయింటి కిచ్చెదవాయని, సరకారు డబ్బని, కోపబడుచుండఁ నప్పారుంపు సంధ్య జెప్పితిని. జంధ్యాలు నిచ్చుచుంటిని, వడుగులు పెండ్లిండ్లు చేయించు చుంటిని, అని బతిమాలుకొనుచున్న నా, కరణ, మా! నా! నని వినక చావడిలో నుంచెనట.

ఉ. అంతటనచ్చటన్ వలయునట్టి పదార్థములెల్ల వంటయై
సంతస వేళమించెనని యాతడు స్నానముసేయ నేగుచున్
జెంతమెలంగు బ్రాహ్మణులఁజేరి గృహద్విజుఁబిల్వనొక్క ధీ
మంతునిబంప నాతఁడసమత్వరరచ్చకుఁబోయి పిల్చినన్. 96

వంటపనులు సిద్ధమైన వెంటనే మంత్రిసత్తముఁడు స్నానమునకు లేచుచూ బ్రాహ్మణు నొకనిబంపి ఇంటి బ్రాహ్మణుని బిలుచు కొని రమ్మనగా వాడు జని పిలచెను. పిలుపగా నా గృహ స్థుండిట్లు జవాబు చెప్పెను.

కం. నాయత్నము లేదిచ్చట
నీయధికారుండు విడువ డీతని యాజ్ఞం
ద్రోయఁగరాదికఁ దడయక
పోయమ్మా యనుచుఁజెప్పెఁ బోజుగుపడంగన్. 97

నీ యధికారి నన్ను వదలడు, యితని యాజ్ఞ మీరరానిది నాయత్నము యేమియుసాగదు నీవు త్వరగా వెళ్లుము అని చెప్పెను.

అంత దానే కరణమునుగూర్చి.

కం. తరువాతవచ్చు నీయన
పరిపరివిధములను శ్రార్ధభంగంబగుఁ గ
వ్వరవచ్చుననుచు జెప్పినఁ
గరణము పంపించననుచు ఘట్టిగ జెప్పెన్. 98

కరణముతో

శ్రార్ధభంగము కాగలదు గనుక తరువాత నీయన వచ్చును, మరల వచ్చును, త్వరగా వచ్చును, అని యడిగినను పంపనని ఘట్టిగా చెప్పెను.

అంత రామమంత్రితో కరణము పంపించనని జెప్ప ననెను.

కం. చెప్పిన నికమీదట నగు
చొప్పెయ్యదివాడు మూర్ఖ చూడామణినే
జెప్పినవినునో వినడో
తప్పదు నాకనుచుఁ బోవదలచెను మదిలోన్.

కరణము పంపించనని జెప్ప నన్నంతనే రామన్న మంత్రి యిం కేమి చేయుదును వాడు మూర్ఖుడుగా నున్నాడు. నేను జని అడిగిన వినునో వినడో నాకు తప్పనదికాదు అని విచారించెను. యిది మంత్రియే యగునేని యాలోచింపునా! తాను ప్రభువు వద్ద లేఖరి మాత్రమే యగునేమో నను సందియము దోచెడు. తాను బిలువనంపిన రావలసిన కరణము కడకు తానే బోయి

తాను జెప్పిన వినునో వినడో యని యోచించుటచూడ అప్ప టికి తాను మంత్రిపదవి నందకుండ నామమాత్రముగ నుండెనని దోచెడి.

కం. అని యూహింపుచుఁ జనిచని
కనియెఁ జిరుచాపమీఁదఁ గాపుల మనవుల్
వినుచు నధికారభరమున
మొనసిన కంసాలి కరణమును జావడిలోఁ. 100

రామమంత్రి కరణము యింటికి పోగా చిరుచాపమీద కూర్చుండి కాపులు మనవులు జెప్పికొనుచుండ వినుచూ అధి కారభరముననున్న కంసాలికరణమును చావడిలో చూచెను.

చిరుచాపమీద కూర్చున్నవాడని వర్ణింపనేలనో? కం సాలికరణమనుట యేలనో కడపటి పేజీల చూడనగును.

" ఇవ్విధంబునంజూచి నివ్వెరపడి యెదుట నిలుచున్నం జూచియుఁ జూడనటులుండిన దనమనంబున " మంత్రి నివ్వెర పడనేలనో. కరణము జూచియు చూడనట్లుండుటయు కార ణము దెలియరాదు. మంత్రి తనలో నీవెవ్వరు, ఏవూరు, ఎందులకై వచ్చితివి అనినైన నడుగడు అధికారగర్వ మిది కదా? అంతకంటె పెద్ద యధికారగర్వము తనకు గలదని తా నెరుఁగడయ్యె.

వ. అనుకొని యతండు స్వకార్యాచరణ స్వభావుండు గావున నిట్లనియె.

ఉ. మంచిది నేడు పైతృకము మాకు నిమంత్రితుఁడయ్యె నీతఁడం
పించు భుజించివచ్చి యటుపిమ్మట నీవరహాలు దెచ్చి చె

ల్లించు నటంచుఁజెప్పిన, 'భళీ ; యిదియేసరియైనమాట చా
లించుము, దాచిపెట్టుకదలించకు నీదగుప్రజ్ఞలన్నియుఁ.105
మాకు తద్దినమునకు నిమంత్రితుఁడై యున్నవాఁడు. గాన
వాపించుము భోజనముచేసి వచ్చిన తరువాతి నీవరహాలు దెచ్చి
చెల్లించుము అనగనే కరణము భళీ !! మంచిమాట. చాలించు,
దాచిపెట్టుము. నీ ప్రజ్ఞలన్నియు కదలించకుము అనెను.

" అతఁడు స్వకార్యాచరణ స్వభావుండుగావున " ఇత
రుల పనులు పాడొనరించియైనను తన పనిని చక్కబెట్టుకొను
స్వభావముగలవాఁడు. నితండది గనిపెట్టియే జవాబు చెప్పెను.

భుజించిన తరువాత పైకముదెచ్చి చెల్లించుమనిన నెవఁ
డైన నమ్మదగి యుండునా ! యెంతకాలమునుండియో యివ్వ
లేనివాడు భోజనము జేయగానే యెట్లు ఇచ్చు. నీ వరహాలు
దెచ్చి చెల్లించుమనుటయు, మంత్రికి దగినమాటయేగాదు.

దానును కరణమును సర్కారుద్యోగులే యగుటచేత నీ
వరహాలు అనడు. అదియసంభవము.

అదియునుంగాక తాసీలుదారు వచ్చుచున్నాడనగనే
దడదడలాడు కరణము రాజునకు ప్రతినిధిగాయుండు మంత్రి
తన యింటికి వచ్చినను ఏమి ఎందుకు వచ్చితిరనియైన నడుగ
కుండునా ? యిది కల్పనజేసినది యని ఘట్టిగా జెప్పవచ్చును.
మంత్రిగాని రాజ ప్రతినిధులగు వారెవ్వరైన గ్రామమునకు
మూడుమయిళ్ల దూరముననుండగానే గ్రామస్థులందరును దడ
దడలాడుచూ మేళతాళములతో నెదురేగి గ్రామములోనికి
దీసికొనివచ్చి మర్యాద చేయవలసినవారిలో ముఖ్యులే పటేలు
కరణమైయుండ, ఇంటికివచ్చినను పలుకలేదు పైగాదిరస్కరించి.

కం. నీవెవ్వరు నేనెవ్వరు
నీవిచ్చిన హుకుముచేత నే నేనిచటం
గావించుట వ్యవహారము
పోవయ్యా నిన్ను రమ్మ్మ పొమ్మనరెవరుఁ. 106

నీవెవ్వరు ! నేనెవ్వరు ! అనుటయూ ! పోవయ్యా నిన్నె వరును రమ్మనలేదనునా ! మధ్యపండితులు పన్నినపన్నుగడలు గాని వీరబ్రహ్మకవియు నిట్లు వ్రాసియుండడని జెప్పవచ్చును.

వ. అనుటయు నమ్మ్రిత్రివరుండూ. 107
సిగ్గులేక మరల ఇట్లనుచున్నాను.

ఉ. ఎంతెటివాడవౌర ! యిదియెంతటిలోపని దీనిఁబూని నా
యంతటివాడువచ్చిన రయంబున లేవవు కూరుచుండుడీ
యింతటనంచు జెప్పవిట కెందుకు వచ్చితివంచు నడ్గవీ
వింతటిలోనె నీపరువుహెచ్చెనె నాకొక వెల్తివచ్చెనే. 108

ఔరా ! నీవెంతటివాఁడవు, నావంటివాడు వచ్చినను లేవవు, కూర్చుండుమనవు, దేనికై వచ్చితిరని యడుగవు, ఇంతలో నీపరువు హెచ్చెనా !! నాకు వెలితివచ్చెనా !!

తే. వేదచోదిత కర్మప్రవిష్టుడవయి
హవ్యకవ్యంబులన్నియు నాచరించు
వాఁడవై యుండి యిదియని వార్యమనుచు
దెలియలేవైతి విదిమంచి తెలివిగాదె. 109

కర్మలకు బద్ధుడవై యుండియు, వేదచోదితమగు హవ్యకవ్యంబులనెల్ల ననుష్ఠించువాడవై యుయ్యు నిది దప్పింపరానిదని గ్రహింపక పోయితివి యిదియా దెలివి. యని

కం. మంచిదికాని మ్మిది మది
నుంచెద, నని తిరిగిపోవ నూహించిన న
వ్వంచకుడగు కరణము నయ
నాంచలములఁ బారఁజూచి యపుడిట్లనియెన్. 110

నవ్వంచకుడగు కరణము అనుటకు కరణమువద్ద నెట్టి వంచన గనుపించెను? నిమంత్రిత బ్రాహ్మణుని వదలకుంట యేనా? నింక నేమయినను దోషము కనపించెనా? అది దప్పుగా నున్న యెడల నిమంత్రిత బ్రాహ్మణుని పంపలేదనియా కరణమును నౌకరిలో దీసివేయరాదా! అది తన చేతి లోని పనియేగదా? నిజముగా వ్యావహారికమగుదప్పు గలిగిన శిక్షింప నర్హుడేగదా! గావున కరణము రాజశాసనము నతిక్ర మింపకుండ నున్నవాడగుటచేతనే మంత్రి నెదురొడ్డన గలిగెను.

మంత్రి తన కుచ్చితమును వదలియున్నవాడేని కరణము యొక్క సక్రమప్రవర్తనకు సంతసింపవలసియే యుండునుగదా? అట్లు గాకుండుటచేతనే మంత్రి వంచకుడని జెప్పవలయును. ముందు తానొనరింపదలచిన పనియు మిక్కిలి వంచనకార్యము యిట్టి వంచకునిముందర సత్యప్రవర్తనము తగునా? ఆయుక్తి కరణము గ్రహించినవాఁడుగాఁడు. యెవరివద్ద యెట్లుప్రవర్తించ వలెనో అట్లు కాలోచితమైనగతి కరణము బొత్తిగా యెరుంగని వాడనుట నిజముగాని వంచకుడనిజెప్పినవారే వంచకులగుదురు.

కం. పరువట పాయమటనా
గరిక మెరుగనట నీముఖంబెవఁడెరుఁగున్
గరగరికముచేఁజనునీ
యరచేతికిఁ బండ్లు వచ్చినపుడే చూతున్. 113

అని తూలనాడెను. అంత.

కం. కరణం బిమ్మాడ్కి దిర
స్కారంబొనరింపఁ ద్వరితగతి నమ్మాటల్
శిరములవలె దాకి మనమున
మెరిమెరిగాన బసకు జేరె మితపరిజనుఁడై. 115

శిరములమాడ్కి దాకిన కరణము మాటలచే దిరస్కృతుడై మనమున చురుకుబుట్టగా దనబసకు జేరెను. తనకెంత పరిజనముతోనున్నవాఁడైయ్యు కరణమును ఎదుట నేమియు చేయలేకపోవుటకు కారణము కరణముయొక్క సత్ప్రవర్తన బలమేనని చదువరులు గ్రహింపవచ్చును. మంత్రియే క్రమప్రవర్తనగలవాఁడైయ్యేనేని దక్షిణమే నా కరణమును దీసివేసియుండును. లేనియెడల దాను నిజమైన మంత్రిగా నేరడనియైన చెప్పవలసియున్నది.

తే. చేరి తనబృత్యునొక్కనిజీరి పైక
మిదిగో! యిది దీసికొనిపోయి యిచ్చివైచి
బ్రాహ్మణుని దోడిదెమ్మని పనుప హుకుమ
టంచుఁ గైకొనిపోయి వాఁడట్లు చేసె. 116

యీబుద్ధి మొదటనేయున్న నిన్నిమాటలు పొసగియుండవు గదా?

అటుల నాబ్రాహ్మణుని బిలుపించుకొని తద్దినము ముగించి తన స్వస్థలంబునకు బోవుచూ, కరణము నెట్లు సాధింపగలనాయను వైరంబు మనంబున నాలోచింపుచూ గృహంబు జేరి పిదప.

వ. సభామంటపంబున మణిమయోచ్చాసనంబునం దెల్లడు గొలువం గొలువుండిన గణపతి మహారాజునుంగని యతని చేత

ననుజ్ఞాతుండై యాస్థానసంబునఁ గూరుచుండి సప్రేమంబుగా నమ్మహీజాని యడుగు కుశలాగమన దివ్యదేశ సందర్శనాది ప్రశ్నంబులకు నుత్తరంబులిచ్చి సెలవు గైకొని యనంతరము.........121

ఉ. అంతటనొక్కనాఁడు సభయందవనీ పతితోడగూడి యే
కాంతమునందునున్న సమయంబున దానటుపోయివచ్చు వృ
త్తాంతముఁ దన్మహాస్థలములందిరవొందు మహాత్మ్యనై ఖరుల్
వింతలు జెప్పిజెప్పి పృథివీవరుతో నొకవిన్నపంబనెన్. 122

(వంచకుడెవరో మున్ముగాన నగు.)

కం. మాదలయను పురినొక క
రాణుఁడు కరణీకవృత్తియందు సమగ్ర
శ్రీననరి యుండు గర్వ
ప్రామర్గ్యావమునఁ దనకుఁ బ్రభువెవరనుచున్. 123

(ఎవ్వరును లేకుండా జూచి ఏకాంతముగా ప్రభువున్న సమయములో మెల్లగా కొండెముల జెప్పబూనెను. ఎట్లన. మాదలయను గ్రామములో నొకకరణము కళాదుడు గలడు. వాఁడు కరణీక వృత్తియందు సమగ్రమైన శక్తిగలవాఁడు మహా గర్వమున తనకంటె వేరు ప్రభువెవరని మీరియున్నవాఁడు. వానిచే ననరానిమాటలబడితిని ఆమాట లిచట జెప్పుకొన్నను. నాకు గొరంతగ నుండును.)

వ. అని పలికి యచటం దానుపడిన బన్నంబులన్నియు విన్న వించి.

కం. అటువంటివారిపై నీ
పటుతర కరణీక కార్యభారమునుప నెం

తటి వారికైనఁ దమ ముం
దట హీనుల జేసి పీడనాడు దురధిపా. 126

ఉ. సర్వము వారిచేనగుట సత్యముగావున దానచే సమ
స్తోర్వియుఁజిక్కిబిక్కటిలుచున్నది యీపయిగ్రామణిత్వముఁ
దుర్వహమైన యీపనియుదోడగుటన్ వివరింపనేల యీయు
ర్వీక, నిర్వహించదనియోచనతోచెన రేంద్రచంద్రమా!!.127

చూడుడు రాజువద్ద యెట్టి యనృతంబుల కొండెములు
చెప్పుచున్నవాడో మంత్రియన నిట్టివాఁడే! మంత్రాంగ
మిట్టిదియేనా? క్షత్రియయోచన చక్కగా గనుపించుటలేదా!

సీ. ఉర్వీతలంబెల్ల నొకత్రాట గొలిపింప
భూస్వభావంబెల్ల బొందుపరుప
వరముల గల్పించి ధనము నిర్దేశింప
జమచేసి దాని భూజాని కనుప
గ్రామంబులోపలగల సంగతులు దెల్ప
జారచోరాదుల సంహరింప
బధికులదొరల దుర్బలుల విచారింప
ధరణీశునకు పదార్థములు బనుప
బ్రాతిపదికయు యిది భూమిపాలునకును
దీనిచేఁగాని నృపతికిఁ దేటపడదు
ఘనతరోద్యోగమైన యీకరణికంబు
గలుగ పేరలఁబట్ట బగ్గాలు గలవే. 128

కరణము కరణీక వ్యవహారముల యందు పమ్మగ
శ్రీదనరి యున్నవాఁడని దానే జెప్పుచూ, పేరల

కరణీకములనుండి దొలగింప వలయునని భూపతికి విన్నవించు. నీ మంత్రి కరణము జెప్పి బుద్ధిచాలక మరల రాజచే బుద్ధి చెప్పించుకొనుచున్నాడు. గనుడు.

కం. ఒకదుర్మార్గుని కొరకై
ప్రకటిత బహుజీవనముల బాపుట యిదియే
మికడఁకయనిన నానృప
మకరాంకునితోడ మంత్రిమండనుఁడనియెన్. 131

ఒకఁడుదప్పుజేసిన పెక్కుమందిని దీసివేయుట ధర్మమా! యిది యేమి నీతి. యనెను. అంతటనైన నామంత్రి బుద్ధిమార గలదా. నైజగుణము మానుట యసాధ్యముగదా! ఎన్నియో పౌరాణికగాథలతోడ జెప్పినను రాజు తిరస్కరించి సభచాలించి లేచెను. అంతట రామనమంత్రికి యెట్లు వీరలకొంపలుముంప నగునా యను యోచనతో కొన్నాళ్లు గడచెను.

ఇట్లు జరుగుచుండ భాద్రపదమాసంబున నమావాస్యాంగారకవాసరంబున సూర్యగ్రహణంబు గలుగుటయు రాజు నఫరివారసహితుండై కృష్ణాస్నానంబునకై బయలు వెడలుటయు, సముచిత ప్రకారంబుల కృష్ణాజలంబులడిగ్గి సంకల్పపూర్వకంబుగా గృతస్నాతుండై దానంబు లవనీసురవర్యుల కొనర్చు సమయంబున నమ్మంత్రిశేఖరుండు దానును జలంబులగ్రుంకి సమయానుగుణంబులగు చెయ్వులన్నియు బొసంగువరచి (వేషము వేసి) లేచి అంజలిబద్ధుడై యమ్మహీవిభునితో నిట్లనియె.

ఉ. నేనును వచ్చినాడ ధరణీతలనాయక దానపాత్రుడన్
గాన మదీయ విన్నపము గైకొని నాకొకదానమీయుమో
భానుని భైకతేజ................ 139

కృతిమహృదయుండగు మంత్రి, చేతులు జోడించుకొని భూవరా! నేనుకూడా వచ్చియున్నాను. దానమునకు నేనును దగినవాఁడనేగాన నా విన్నపమాలించి నాకు నొకదాన మివ్వవలయునని కోరగా. రాజు.

చ. ఉచితమె దానమీయగ నియోగివిగ్గాకొన నీకు సర్వమే
సచివులు దీనపోషణ విచక్షణులంతియెగాక యెంతయుఁ
బ్రచురతరాభిమానముల పాల్పడి యుండెడి వారలాటచే
నుచితమటంచునీవడుగనోపిన నీయక యుందునే యనఘా.140

నీవు నియోగివిగదా మరియు మంత్రివి నీకు దాన మిచ్చుట యుచితమా! అభిమానము విడి నీవే అడుగగా నే నివ్వకుండఁదగునా? యనిన దానును దగినవాఁడనని పెక్కు భంగుల జెప్పికొని మిక్కిలిగ ప్రార్థింప కళింగభూపతియు, నట్లయిన నడుగు మిచ్చెదననిన.

తే. ఆశ్రితామరభూజ నేనడుగునపుడు
వలపుమీరంగ దేవరవారి ముద్ర
జాము దయసేయు దంతియచాలుననిన
నిచ్చెదను గొమ్మనుచు మాట యిచ్చెనతడు. 143

కం. తనరాజ్యపదవి వేరొ
క్కనిపైనుంచుటకు వేడుగాఁజూడక కై
కొనుమిచ్చెదనని పలికెను............ 144

యీపద్యము రాజుయొక్క మాంద్యమును దెలుపు చున్నది. ఇది జుట్టు చేతికిచ్చి గంతులుబెట్టినట్లున్నది. ముందు దానమిచ్చి మరల నాలోచించుట. మరల విచారించుటయు౯! పొందినవాఁడు పొగడ కేమిజేయును.

వుడమి రేదు ముద్ర యిచ్చుట కొడంబడి యనంతరంబు నిజరాజధానియగు విజయనగరాభిధాన పుటభేదనంబుఁ బ్రవేశించి ప్రాజ్యసామ్రాజ్యభోగియుడై యుండె. రామప్రధానుండును ధనసంకల్పంబు నిర్విఘ్నంబుగా సిద్ధించుటకు సంతోష భరితాంతః కరణుండగుచు.

ఉ. వేవురుభృత్యులంబిలిచి వేగమ మీరలుబోయి యస్మ! దీ
యావనియందు జెల్లుబడియై తగు దేశములందు గల్గు వి
ప్రావళినెల్ల నిచ్చటికి రమ్మని వారలతోడ మీకునే
జీవనముల్ ఘటింతునని చెప్పితిరంచని తోడి తేదగుర్. 147

మీరుజని భూసురోత్తముల కందరికి మనయేలుబడిగల దేశంబుల నెల్లచోటులను ప్రకటించి నెలరోజులలో నందరును జేరునట్లుగా జేయువలయునని యు నాజ్ఞాపింప భటులాప్రకారము దేశములనెల్లఁ జాటించిరి.

చ. కదునడి నిట్లుపోయి న యగౌరవముల్ గనుపట్ట బిల్చినన్
దడయక రేపు మాపనక తచ్చనలాడక మాకు నెవ్వడో
యొడయడు బుట్టినాడని మహోత్సవముంగనబోవునట్లుగా
వెడలిరి వేలు వేలు పృథివీ సురలందరు సంతసంబునన్. 150

రామన్నగారి ప్రకటన వినినంతనే భూసురోత్తములు వేనవేలు మహాసంతసమున తమకు గొప్ప యేలికయొకఁడు బుట్టినాడని గొప్ప యుత్సవమునకుఁబోలె బయల్ దేరిరి.

గీ. ..."వచ్చినిలచిరి పురి వాడవాడలందు
మేడలందు పవనముల నీడలందు......
పట్టణము నేలయీనినఁబగిదిఁదోచె." 151

బట్టణము పట్టుకుంచునట్లు నేలయీనినపగిది పిక్కటిల నిండి పోయిరి. అంతివారలకు రామన్న గారిట్లు జెప్పిరట. ......నిరంతరానుభవ పాత్రంబులగు దానపత్రంబుల వక్కాణంబు నొక్కటి నిర్మాణంబుచేసి మీకిచ్చెద...తత్ప్రకారంబున సకల గ్రామంబులకు లిఖియించుకొని మాసాంతంబునకు నాకొసంగవలయు నని యాజ్ఞాపింప.

కం. ఈరీతి దానపత్రము

లారూఢములైన పిదప నధిపతిచెంతన్

జేరిభయ వినయగౌరవ

ధీరత ధరణీశునకు సుధీప్రవరుడనున్. 155

ఇట్లు పత్రములన్నియు సిద్ధముజేసి యుంచుకొని రాజు కడకేగి భయ, వినయ, గౌరవ, ధీరతలు, గూడుకొన నడిగెననగా !

లోగడ రాజు యీపనిదగదని చెప్పియున్నను దానాపని యె కృత్రిమముగ జేయుచున్నాననుటచేతఁ భయము. ఎట్లయినను దనకార్యముసాగించుకొను ప్రార్థనముగ, వినయము. నేనింతటి సాహసకార్యమును జేయుచున్నానను, గౌరవము. లేక భూసురోత్తములెల్ల తమకేలికబుట్టెనని పొగడుకతననేని, గౌరవము. రాజొకప్పుడు యీపని మిక్కిలి యన్యాయము దగదని విముఖుడైనను దగు పౌరాణికకథలచే సమాధాన పరుపగలనన్న, ధీరతయు దోపు. యిందు కవిభావముఁ గడురమ్యమై గనుపట్టెడు.

చ. ......కృష్ణకడ నప్పుడొసంగిన మాటచొప్పుఁ

దప్పక నిపుడీయగావలె నృపాల భవత్కామనీయ

రామమ్ముదిక.........157

ముద్రిక నడుగ నప్పుడు రాజు తనమాట దప్పజాలక నటులనే యిచ్చెను.

తే. ముద్రగై కొని సర్వతోభద్రగరిమఁ
.........దానపత్ర
సమితి గుంతటిపైఁ జిహ్నితములోన ర్చె
సత్వరస్ఫూర్తిచే నొక్కజాములోన. 158

మిక్కిలి జాగరూకుడై యొకజాములోన పెక్కు దాన పత్రములపై ముద్రించె నాపత్రములందు

సీ. శాలివాహాఖ్యక శకవత్సరముల ద్రి
రసపుష్కరేందుల నెసగుచుండ =1067
రక్తాక్షివర్ష భాద్రపద కృష్ణమా ప్ర
యుక్తుజవార సూర్యోపరాగ
సమయంబునఁ గళింగ జననాయకాగ్రణి
గజపతివంశప్రకాశకుండు
గణపతిరాజు శాఖా సూత్ర గోత్ర పం
పన్నుడవౌ నీకు నిశ్చయాళ్లు

గీ. ననదృశంబైన గ్రామణిత్వాధికార
మున నొసంగెను ననుభవింపుము రవీందు
తారకంబునుగల్లు నందాకననుచు
వేరువేరుగ నుండుట వినిమెన్నపుడు. 163

ఇట్టి దానపత్రములుజూచి.

" ఆ జనపతి చిరునవ్వు సొంపెసంగగ మదినివ్వెరజెంది" మంత్రి యొనరించిన పనికి నవ్వి నివ్వెరజెందక నేమిజేయును?

వేమనజెప్పినట్లు వెఱ్ఱికళింగము కళింగరాజును కాబట్టి దప్పిపోయెనుగాని, యేరాజుకడనైన నిట్టి కార్యములు జేయ జెల్లుబడి యగునా? చిరకాలానుభవమైన హక్కు బుక్తమై యుండ. రాజుకు దెలియకుండ రాజే దానముచేసినట్లు వ్రాసి వ్యవహరించెను ఇందురాజుకు దానపత్రములు చూపినట్లును రాజు సమ్మతించినట్లును జెప్పబడియున్నను రాజున కెఱుక లేక యే రాజముద్రనుబట్టి అంగులులో బెట్టి యుండునుగాని రాజే సమ్మతించెననిన, వెఱ్ఱికళింగమను మాటయు, గద్దవంటివాఁడు గణపతికాడా? యని వేమన జెప్పినదే నిజమనవలెయుగదా?

ఉ. దీనిధిగోపరాజకుల దీపకుఁడై తగురామమంత్రి పం
చాణులయందు నిశ్చలతనానిన యీకరణీక ధర్మముల్
పూనికజేసి ద్విజపుంగవుల కొలిపించి యిచ్చె నౌ,
నౌ, నని సంతసించిరినరంతరసౌఖ్యమునొందిరందరున్.167

బుద్ధిమంతుఁడగు, రామమంత్రి పంచాణుల కరణీకము లను ద్విజులకివ్వగా, ఔ. ఔ. నని సంతసించిరట. ఏమి సం తోషమో సంతోషము. లోకులసొమ్ము తమ సొమ్ముగాజూచు జ్ఞానుల కెప్పుడును సంతోషమే.

మరియు నీకథనే పీఠికాపురసంస్థాన పెద్దాపురనరు పెద్దాడ చిట్టి రామయ్యగారి సంపాదకీయమగు ముప్పది యిద్దరు మం త్రుల చరిత్రమునందలి యాకథనే యిట్లు చెప్పబడినది.

మంత్రి బ్రాహ్మణార్థమై బిలవనంపు పట్టున.

"మంత్రి సార్వభౌముండు యావిప్రుని స్నానార్థము దెలుపం దగువారలంబనుప నాతా విప్ర నామంత్రణంబు చేయ న్నాబ్రాహ్మణుండు. కంసాలింజూచి. యోయీ!! యూకలు

రేపు చెల్లించెదను...... నేను మతింగై కొందునా! యనిన నక్కంసాలివాఁడత్యాగ్రహంబున" నని వ్రాసిన వ్రాతగాని నేనుకవలెనో దోచకున్నది. ఇది యంతయు నెచ్చెగళు సాం ప్రదాయకములో జేర్పవలసినదైనను కొంచె మీచమత్కార మును విచారింతము. జాతీయ నైజము మారదు గదా ?

మంత్రిసార్వభౌముండట ! పరమసాత్విక ప్రచారుండగు పాఱుండట ! అక్కంసాలివాఁడత్యాగ్రహంబున, నట ! బళి. బళి. యీముప్పౌ విశేషణములును బుద్ధిమంతులు విచారింతురు గాక.

కంసాలి ప్రసక్తియే లేనిచోట నీమాట యేలనో.

దాన, నెపమున రాజద్రోహమును, ప్రజాద్రోహమును వెలువకఁ జేయువాఁడగుటచే సార్వభౌమ బిరుదం బందులకై యిచ్చిరేమో.

పారులందు పన్నెగవేసి దాఁగి తంటాలు బెట్టుటచే నట్టి వాఁడు పరమసాత్విక ప్రచారుండందురు కాబోలు. సరియే.

కంసాలివాఁడత్యాగ్రహంబు కరణము చావడిలో నుంచగా కంసాలి యేమిచేసెను. కంసాలి యనగా స్వర్ణకారుడు. ఇది వృత్తినామము కరణమునే అల్పులగువారు స్వల్పముగా నని రన్నను కరణము రాజశాసనము మేరకు పన్ను వసూలు చేసెనుగాని వీరలకేమి యపకారమును జేయలేదు గదా ?

కంసాలివాఁడత్యాగ్రహంబున యనుట వారి దుస్వభావము బయట బెట్టుకొనుటకంటె వేరులేదు. కరణముచే చావడినుంపబడిన పారుండు. వోయి! రూకలు రేపు చెల్లించెదను. మంత్రీంద్రుండు నాకొరకు వేచియుండును నేనను మతిం

గయికొందునా యనెనట. ఏమి స్వతంత్రము వోయి! కైది గానున్న వాఁడేమీ వోయి నాకు శెలవిమ్ము. అనెనా. వోయి. అనిన నాకాలమున నాకరణము మూర్తిపై వాతబెట్టక వదలు వాఁడేనా. అంతటి మంత్రిని లక్ష్యముచేయునివాఁడీతని మన్నించునా ? యివి కారుకూతలు. బొంకులు.

తే. ఒరులవంచించు పనిగజూ, పోపలేని
పండితునకంటె నెక్కుడు, పంచముండు
అట్టి పంచములిప్పుడు, నధికమగుచు
శ్రేష్టులమటంచు దమకుదా చెలగుదురహా !!.

ఇట్లు ఆర్యనారాయణమూర్తిగారు తమ గ్రంథమున జెప్పి యున్నారు.

ఆనుపేయులలో పద్యము చెప్పగల పండితులెల్ల యేగి యో నొకచేయి బయటబెట్టకబోరు.

ఆకుండి వ్యాసమూర్తి శాస్త్రిగారు.

కం. ఓరి యగసాలె ; యన్యుల కుమ్మవికము
గలుగుమాయల, నెఱజాణ ! గాచెదేల ?
ననుబలుమారు, నగ్గి, నావన్నె హెచ్చు
గాచ, బొగ, దుమ్ముబడు, నీమొగమ్మునందె.

పులికొండ పరబ్రహ్మ కవిగారు చెప్పిన సీసము.

సీ. నిందించి'రస్మతవా ♦ ణీభర్త'లరయఁగం
సాలులేయనుచుఁబ ♦ ద్యాలతోన
పల్కిరి'బంగారు ♦ పైదెబ్బహింసాఘు
దాయకంబనుచు శా ♦ స్త్రాలలోన

కనలుచూపిరి స్వర్ణ ♦ ఘాతుకాదినుశులఁ ;
బలుదెఱంగుల నార్య ♦ పాళిలోన
వంచిరి యీవృత్తిఁ“ ♦ బంచమహాపాప
కర”మంచు నెల్లలో ♦ కాలలోన

తెలిసినంతనె మర్యాద ♦ తెరువుఁబట్టి
భేదభావానఁ జూతురు ♦ పెద్దనేని
నక్కటా! వేదసమ్మతం ♦ బైనదీని
కవమతమిదేల ? సాంఘికు ♦ లార ! కనుఁడు.

మంత్రుల చరిత్రంబునందు (16 పేజిలో) నిట్లు క్రిష్ణకడ దాన సమయంబున గలదు.

“ కావున నవశ్యంబు దానం బిమ్ము పరిగ్రహించెదనని మంత్రినిజూచి రాజు. మంత్రీ! నీవేమి కోరెదవో యిట్టి సమయంబున దాని నొసంగకుండిన రాజధర్మంబుగాదు. ఇచ్చిన బుచ్చుకొని ఏమిచేసెదోయని మదీయ చిత్తంబు సంశయాయత్తంబగు చున్నదనిన. మంత్రీంద్రుండు మహారాజసార్వభౌమా! స్వామిద్రోహం బొనర్చునట్టి మంత్రి పంచమహాపాతకం బొనర్చినవాడై నరకంబునంబడు.

నేనట్టి ద్రోహినిగా ననుటు, దేవరదివ్యచిత్తంబునకు విశదంబెయుయిఁను, బ్రమాణంబొనర్చెద నమ్ముమని త్రిమూర్త్యాత్మకమగు సూర్యనారాయణ పరబ్రహ్మంబుసాక్షిగా, త్రిలోకపావనియగు గంగ సమీపంబున అనృతంబాడ. నమ్ముమని రాజున కభయ ప్రధంబులగు ప్రమాణంబు లాచరించి” ఔరా! ఎంత సాహసము.

ఇచట రాజు తన్ను మోసపుచ్చునేమోనని సందేహింప మంత్రి ప్రమాణమ్ములజేసి రాజును భ్రమింపజేసి తుదకు మోసపుచ్చిన వాడై య్యెను. రాజున కట్లుండ వైదికులనుకూడ మోసపుచ్చిన వాడాయెను. వంచకునకు వంచన సహజమగు గదా ! గనుడు. ఇంతకుముందు.

మ. చ. " తద్దేశ వాస్తవ్యులగు ధరామరుల నెల్లర రావించి యీగ్రహణ సమయంబున మన గణపతి దేవరాజేంద్రుడొసంగు. గో, భూ, సువర్ణాది మహాదానంబులందెవ్వరికేది యిష్టంబగు నాధనంబు వారలకే నిచ్చెద, దత్సమయంబున మీరలెవ్వ రవ్వసుమతీపతికి దృగ్గోచరులు కావలదు అని... వారికిఁదగు నమ్మికలొసంగి " వైదికులనెల్ల క్రిష్ణకడకు రాకుండజేసి తానే రాజుచే నివ్వబడు మహాదానములనెల్ల గోరినట్లొసంగుదుననియు నమ్మించి ఆశబెట్టి ద్రోహము చేసిన తంత్రవాడియగు నీమహామంత్రి పంచాణుల వంచించి ముంచుటకేమి యబ్రము. తరువాత నీయసత్యముల గనుడు. రాజు.

ప. "అవ్విప్రపుంగవుల నందర రావించి... రామయామాత్యుండందియీయ న్వేరువేరుగాఁ గర్పూర తాంబూల సమేతంబుగా దానపత్రమ్ము లొసంగి మీరలు మీమీ నిర్ణయ గ్రామంబులకుఁజని, స్వామికార్యనిర్వాహణ ప్రవీణులై... సుఖంబుండుడని యానతిచ్చిన "

యిది నిజమేయగునేని క్రిష్ణకడ ముద్రను దానము గోరవలసిన పనియే యుండనేరదు. రాజున కెరుకలేకయే యీ శాశననిర్మాణసభ్యులగు మంత్రుల మాయానాటకము రాజు పేరునబెట్టుటకై చేసిన పన్నుగడలు చదువరులకు గనుపింపక

బోవను. చిరకాలానుభవముగు విశ్వబ్రాహ్మణుల కరణీకం బుల నూడబెఱికి వీరిచేత బెట్టుటకు రాజునకేమి యవసరము గలిగెను. క్రిష్ణకడ నాదానమునకు కాసులా, డబ్బులా! పన్ను దిన్నగా వసూలుజేసిన దప్పిదమునకై నిరాజునకాగ్ర హాము కలిగెనందురా! వానినే శిక్షింప దగునుగాని ఇతర గ్రామోద్యోగంబులనెల్ల నేలదీసి వేరొకరికిచ్చునా. సియోగు లకుదగిన యోగ్యమగు దానమొకర్వ నింకేమియు దొరక దయ్యె కాబోలు. నిట్టితరి

కం. "మునుపయ్యధికార భరం
బునగర్వితులై మెలంగు, మూర్ఖులఁ గంసా
ళ్లను బలిమిందొలగించిరి
యనితరరాజాజ్ఞకెందు, నడ్డముగలదే." 166

పూర్వము అధికారగర్వమున మూర్ఖులగు కంసాళ్లను బలిమిచే దొలగింపబడిరట! అధికారముగల వారలకెల్ల గర్వ ముండుననిన తనకును అదితప్పకుండ నుండునుగదా? తను పెద్ద యధికారముగల వాఁడగుటచే పెద్ద గరువముగలిగి యుండవల యుగదా! అధికారముచేత కలిగిన మూర్ఖము యీ కరణము నకే తటస్థించెననుట దగదు. గంసాళ్లనుట, యెన్నిపర్యాయ ములు చెప్పబడియున్నదో అంతయు మూర్ఖమేగదా! బలిమిం దొలగించిరి యనుట నిజముగా రాజాజ్ఞయనుట నసత్యము. యిది రాజునకెరుకలేకుండ కృత్రిమశాశనంబని యిదివరకే దెలి సికొని యున్నాము. కెల్లంపల్లి కరణము కోటయ్యగారి ఇంటి లో కరిణీకచరిత్రాంశమునుగూడ నివేదించుచున్నాను.

తరువాత "రాచనగరులోని శిల్పాచార్యులును కార్మి

కులును రాజును సమీపించి మహాప్రభూ ! చిరకాలానుభవ ముగనున్న కరిణీకములఁ దీసివేయుటకుచేసిన యపచారమేమి? వారలయెడఁ నెట్టిదోషమేని జనించినదియా ? దేశాభివృద్ధినే గోరు కరణముల నిట్టిచిన్నజూపుజూడబాడియే? యనిఁ బ్రార్థింప వారలఁగని గొంతతడవాలోచించి తనలో గోపరాజు రామన్న దన్నడిగిన వెనుకటి కరణములవిషయము జ్ఞప్తికిరాగ, గో.భూ. సువర్ణాదుల నడుగక ముద్రను దానమడుగుకారణ మిందులకే నని గ్రహించి. చేయునదిగానక. వారలంగని యిట్లనియె. నిది నావలననైనపనిగాదు. దీనికొక యుపాయము జెప్పుచున్నాను. యీయుంగరమును రేపుదయమున రామప్రధానిచేనిచ్చి బాగు చేయించుకొని రమ్మని బంపుచున్నాను. మీరలెవ్వరు నాపని జేయక నా వుంగరమట్లే నాకు జేరునట్లు జేసితిరేని మీకార్య ములు చక్కబరతునని సమాధానపరచి బంపించెను మరునాఁ డుదయమున రామప్రధానిం గాంచి తన వ్రేలి సిధిల యుంగర మును నందలి వజ్రములను నొసగి రేపు సాయంత్రమునకు దీనిని జాగ్రతతో బాగుచేయించుకొని నాకు జేర్పవలయునని ఘట్టిగా జెప్పిరి. రామన్నగారు వల్లెయని యుంగరమును దీసికొని గృహ ముజేరి దీని నెవనిచే బాగుచేయింతును. కరణముల కపకార ముజేసితినని యీ కంసాలులెల్లరును తోకద్రొక్కిన దాచు లట్లు బుసగొట్టుచున్నారు. దీనిని బాగుచేయుటన దిరస్కరింతు రేమో నను సందియము దోచెను. యెట్లు పని నెరవేరునను యోచనతో మంచమున బరుండి విచారించుచుండెను. స్నాన మునకులెండని పలుమారు బిలచుచున్నను పరధ్యానమున లేవ కుండెను. అంత నాయన కొమార్తె తండ్రిని సమీపించి

నాయనా ! ఎన్నిమార్లు బిలిచినను వేళయతిక్రమించినను భోజ నమునకు లేవకున్నారనిన. అమ్మా ! రాజు తన యంగుళీయ కమును రేపు సాయంత్రమునకు బాగు చేయించుకొని రావలె నని యిచ్చియున్నాడు. నేనుజేసిన కరణీకాపహరణమున నీ కంసాలులెల్లరు నను చురచురఁ జూచుచున్నారు. అట్టివారినీ పనిజేయుఁడన. తిరస్కరింపక బోవరు. ఎంతటి ఘనకార్యముల నేని నవలీలనేరవేర్చు నాకిది దుర్ఘటముగా దోచుచున్నది యన గనే నాకొమారిత. అట్లయిన కంసాలులు గర్వించి రాజు పని యైనను జంకులేక తిరస్కరించిరనిజెప్పిన వారిని భూపతి దండిం పడా ! అనిన, నామంత్రి అట్లు జెప్పితినేని ప్రభునకు నాపై యసూయజనించు నెందుకన. మన కోటలోనికిఁ గావలసిన పిరంగులు కత్తులు మొదలగు యుద్ధపరికరములును శేవ్యశకట అలంకారాది సమస్త పరికరంబులును వారివలన గావలసి యున్నది. అట్టి వారికి నీవపకార మొనర్చుకతన యీస్వల్ప యుంగరమే చక్కబడదయ్యె నింక పెద్ద పెద్ద పనులేమగునని యనవచ్చును. నిందింప వచ్చును, అనునంత నామె. యీ యుంగరము నిట్లిండు. నేను జేయించికొని వచ్చెదను. దీనికై విచారింప బనిలేదని తమకు పరిచయుడగు నొక స్వర్ణ కారయువకుని కడకుంజని యిది నావలన జెడిపోయినది దీనిని మన పెద్దవారల కెవ్వరికిని దెలియకుండ బాగుజేసి యివ్వవల యుననిన విషయ మెఱుంగని యాయువకుండు రహస్యముగనే చక్కబరచి యిచ్చెబంపెను. ఆయుంగరమును నియమితకాల మునకు రామప్రధాని రాజునకొసంగెను. పిదప మూడవనాడు శిల్పకోత్తములు రాజుకడకేతేర వారికాయుంగరముఁజూపి నేను

ాకుజెప్పినట్లు చేయజాలక పోయితిరి. గనుక యది మీ
గిరి. అంతవారు మేము చేయలేదు. ఎవరుచేసితి!
ల్లా తరపడజొచ్చిరి అదిజూచి రాజు మీ
రభిమానశు వను దెలిసి వ్యవహరింపలేక
బోతిరి. బొమ్మనిరి ందించుకొనుచూ
నిండ్లకు జనిరి.

ఈకథవలనను రాజునకు దానపత్రముల
దెలిసినట్లు గాన్పింపదు. పిదప వీరు స్వతంత్రజీవనమే
కరిణీకములు పదలుకొనుటయే యీ వర్ణము పతనమగుటకు
ముఖ్య కారణము.

ఉ. “ధీనిధిగోపరాజకులదీపకుడై తగురామమంత్రి పం
చాణులయందు నిశ్చలతనానిన యీకరణీక ధర్మముల్
పూనిక జేసి తీసి ద్విజపుంగవులం బిలుపించి యిచ్చె నా
నానిసంతసించిరినిరంతర సౌఖ్యమునొందిరందరున్.”107

రామమంత్రిచే చేయబడిన దష్కృత్యముల రాజువల్ల
కలిగినదేమోనని చదువరులు భ్రమింపకుండ నీపద్యము జెప్ప
డినది. పంచాణుల ద్రోహముచేసినది రామన్నగారేనని యీ
ధానము దెలపెడు జదువరులే ధర్మాధర్మంబులనరయుదురుగాక.
ఇట్టి కృత్రిమ కుతంత్రముల విడచి భారతీయులెల్లరును సోదరత్వ
మున మెలగుదురు గాక ! సరళసమదృష్టి పరమేశ్వరుడు ప్రసా
దించు గాక. సత్యమును జ్ఞానమును ఆనందమును ప్రసాదింప
రబ్రహ్మమును ప్రార్థించుచూ నింతట విరమించుచున్నాడను.

సంపూర్ణము.

## సూచన.

[redacted]శ్వకర్మ వంశీయులకు ఉత్కర్షము పూ
ర్వమునుండియు గలదు. శిల్పాచార్యుల యున్నత పదవ్యు
గౌరవమును మిక్కిలిగా న   చక్రవర్తుల
నెక్కువగ నుండెను. (వి   లోని ఇంజనీర్లను బోలినదే
శిల్పాచార్యులను పదము   క చక్రవర్తి శిల్పాచార్య నం
తెటివాడనుటచే శిల్పాధిక్యలగు ననగు.

శా. ఆచంద్రార్కముగా నెలుంగధర బ్రహ్మాండంబు తారాలపై
బ్రాచుర్యంబుగ శాశనంబులను శుంభద్వృత్తిఁజెక్కించి యెం
తో చిత్రంబుగ శిల్పకృత్యములఁదా స్థూపంబులంజూపె శి
ల్పాచార్యుండో! యశోకుడంచు, విభుఁడు ల్పావింప నెక్కా
లముఁ॥

ఆప్పటి రాజశాశనములును కఠినములుగనే యుండెను. "శిల్పాచార్యుని చేతికిగాని, కంటికిగాని, యేయవయవమున కేని చెడుగుఁ గావించినవానికి మరణశిక్షయే."

అట్టి శిల్పుల నల్పముగజేసి తామా యున్నతపదవిని ననుష్ఠింప ప్రయత్నించిరిగాని చంద్రగుప్త అశోకచక్రవర్తుల కాలమువరకును సాధ్యపడినదిగాదు.

చంపాక గ్రామవాసియగు నొకపాఱుండు సుబద్రాంగి యను సౌందర్యవతియగు తనకొమార్తెను బిందుసారున కొసంగెను. ఆమెయు దండ్రి యభిమతం బెఱింగినదగుట దెలివితో నటించి పట్టపురాణియై వెలసెను.

అదిమొదలు ఆరుషేయులకు కొంతయవకాశము చిక్కినది. దమకోర్కి దీరుట కిదియొకమార్గమని గ్రహించిరి. శిల్పు